# పిచ్చా పాటీ

[ వ్యాససంపుటి ]

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు





శారదా పబ్లికేషన్స్
4, పైక్రాఫ్ట్స్ ఫస్ట్ స్ట్రీట్
రాయపేట :: మద్రాసు 14



కృతజ్ఞత : చిత్రకారుడు

శ్రీ హెచ్. వి. రామగోపాల్‌కు

కీ ర్తి శే షు లు

శ్రీ నార్ల వెంకటరామన్న

పెదనాయనగారికి



వెల: రూపాయిన్నర





ప్రథమముద్రణ :

ఏప్రిల్, 1951

ముద్రణ :

బి. యన్. కె. ప్రెస్

ఆచారప్పన్ స్ట్రీట్, జార్జిటౌను

మద్రాసు

# వ్యాసానుక్రమణిక




| | |
|---|---|
| జగన్నాటకం | 9 |
| రూపం, గుణం | 16 |
| పదవీవ్యామోహం | 23 |
| రంగుటద్దాలు | 30 |
| స్మారకచిహ్నాలు | 39 |
| నానాత్వంలో ఏకత్వం | 48 |
| కవుల ఢంకా | 5 |
| కాకి, కోయిల | 7 |
| రిపార్టీ | 8 |
| ముదిమి | 9 |
| పేరు, పెన్నిధి | 11 |
| దాహం | 12 |

నార్లవారి
ఇతర రచనలు.

కొత్తగడ్డ
మాటామంతీ





ఈ సంపుటిలోని చివరి రెండు వ్యాసాలు ఇదివరలో ఎక్కడా ప్రచురణ కాలేదు. తక్కినవి విభిన్నరూపంలో "ఆంధ్రప్రభ"లో వెలువడినవి—రచయిత.



# జగన్నాటకం

నీళ్లు పోయించుకోడానికి వాళ్ల అమ్మను రోజూ గిరికీలుపెట్టే మా రెండవ పిల్లవాడు ఇవ్వాళ నీళ్లు పోస్తావా, లేదా అని మారాం చేశాడు. ' జ్వరం తగిలింది—వద్దురా, బాబూ!'' అంటే రాగం తియ్యడం మొదలు పెట్టాడు. "నా నాన్నవు కాదూ, బాబువు కాదూ, నామాట వినరా!" అని ఎంత బతిమాలినా, అంత కంతకు రాగం పెద్దది చేసి, ఇంటి పెంకులు ఎగరగొట్టి వేశాడు. పాదరసం వంటి బుద్ధిగలవారని, చపలచిత్తులని పసివాళ్ల ఈ ప్రవర్తననుగురించి చెప్పుకుని మనం సరిపెట్టుకుంటాము, కాని, పెద్దవారు మాత్రం అంత స్థిరచిత్తులా? వారి వర్తనైనా వైరుధ్యరహితమా?

పెద్దవాళ్లూ ఒకనాడు పసివాళ్లే, పొత్తిళ్లలో పెరిగిన వాళ్లే. గడ్డాలవానికి అడ్డాలవాడు సాక్షాత్తు తండ్రి అని

వర్డ్స్‌వర్త్‌మహాకవి చెప్పినమాట కడిగిపోసిన సత్యం. పెద్దరికం పిన్నరికానికి కేవలం తరువాయి కాబట్టే, ఎంత పెద్దవారిలోనైనా పిన్నతనం ఎంతోకొంత మిగలనే మిగులుతుంది. ఎటొచ్చీ అతడు తన పిన్నతనానికి సిగ్గుపడి దాన్ని కప్పిపెట్టుకోడానికి ప్రయత్నిస్తాడు. లేదా, దానికి మరొక రూపమివ్వడానికి ప్రయత్నిస్తాడు. చిన్నతనంలో బాణసంచా తానే కాల్చుకుని ఆనందించినవాడు పెద్దవాడైనాక "భయం లేదు, బాబూ! దగ్గరికిరా, చూడు? ఎంతచక్కగా కాలుతుందో! పోనిలే, నేను ముట్టిస్తాను—నా చెయ్యి పట్టుకో" అంటూ పిల్లవాడి వంకతో మతాబాలు, కాకరపువ్వొత్తులు, వెన్నముద్దలు, చిచ్చుబుడ్లు వగైరాలు కాల్చుకుంటాడు. "ఛల్ ఛల్ గుర్రం" అంటూ తాను మరొకరి వీపుపైకెక్కి స్వారిచేయలేడు గనుక, తానే గుర్రమై ఆ ముచ్చట కాస్తా తీర్చుకుంటాడు. లేదా, గోలీలతోను, గచ్చకాయలతోను ఆడిన ఆటలకు మారుగా రూపాయల, అణాల, పైసలతో ఆటలాడతాడు; తూనిగలను, గాలిపటాలను యెగరవెయ్యడానికి బదులుగా ఆలోచనలనే తూనీగలను, ఆశలనే గాలిపటాలను యెగరవేస్తాడు. తోటలోని సీతాకోక చిలుకలవెంట పరుగులిడ్డానికి ప్రతిగా సంఘంలోని సీతాకోక చిలుకలకై భ్రమపడతాడు. బాల్యచాపల్యం చావడం కల్ల. అది ఛద్మవేషాలను ధరిస్తుంది — అంతే!

ఈ ఛద్మవేషాలైనా ఒక వయః పరిమితివరకే. తల నెరసి, నడుం వంగి. సులోచనాలు ముక్కుకొనకు జారేసరికి

పసితనం తిరిగి నిజరూపంతోనే బయటపడుతుంది. వృద్ధాప్యం ద్వితీయ శైశవమని షేక్స్పియర్ పిచ్చివాడై అనలేదు. నిజానికి, తొలి శైశవంలోకంటె ఈ మలిదానిలోనే చిత్త చాంచల్యం హెచ్చు, ఏమీ తెలియనివారు కనుక, పసికందులు ఒకసారి కాకపోతే, మరొకసారైనా చెప్పినమాట వింటారు. తెలిసీ తెలియని మేళం కనుక, మతిసడలిన ముసలివారు పట్టేకుందేటికి మూడే కాళ్లు. ఏదైనా సొద మొదలిడితే అదే సొద; ఎందుకైనా సణుగుడు ప్రారంభిస్తే అదే సణుగుడు. పోనుపోను వారి ముందు ముక్కుగోక్కోవడమే మహాపాపమౌతుంది.

మతిమళ్లినవారి మాటకేమిగాని, శైశవానంతరమైనా శైశవవిలక్షణాలను కోల్పోనివారే ధన్యజీవులు. కన్నీటి తడి ఆరకముందే కిలకిలనవ్వడం పసివారికే చెల్లు. కీచులాడుకుని వెనక్కితిరగకముందే కౌగిలించుకోవడం వారికే తగు. చేస్తూచేస్తూవున్న పనిలోనుంచి చిటికలో చిత్తాన్ని మళ్లించుకోవడం వారికే సాధ్యం. పోకచెయ్యనిదానికి రూకవిలువ నివ్వడం వారికే వల్ల. విస్తుపోగలగడం వారి సొత్తు. కల కల్లకానిది వారికే. గొప్పవారనదగువారు ఏ వయస్సులోనూ శైశవసహజమైన ఈ విలక్షణాలను కోల్పోరు. అతి గభీర సమస్యలో నిమగ్నమైవున్నా క్షణంలో దాన్ని ఒక పక్కకు నెట్టివేసి పసివారిలో పసివాడై గాంధీజీ వారితో దోబూచు లాడగలిగేవాడు. వర్గవిప్లవజ్వాలలకు సమిధలను సేకరిస్తూనే ఆ కఠోరకార్యసాధనను కాసేపు కట్టి

ట్రి కార్ల్ మార్క్స్ కన్నబిడ్డలకు స్వారిగుర్రం కాగలిగే డు. మనమలతో జతకూడి తోటలో విల్లంబులతో ఆట డుకోవడం ప్రారంభించేసరికి జర్మన్ మహాకవి గెటీకి పంచమే కనుమరుగై పోయేది. బాలబాలికలమధ్యకు ళ్ళితే వారి తరళలోచనాలవలె లెనిన్ కళ్ళుకూడా మెరి వి; వారిని చుట్టూచేర్చుకుని కథలు చెప్పకోవడం ప్రారం స్తే కాలమే స్తంభించిపోయేది. ఒక కొత్త పోస్టుబిళ్ళ రికితే ప్రెసిడెంట్‌గిరి ఎన్నికలో తాను తొలిసారి గెలిచి ప్పటికంటె రూజ్‌వెల్ట్ పరమానందభరితుడయ్యేవాడు. ముద్రంవొడ్డుకు వెళ్ళి యిసుకలో పిచ్చుకగూళ్ళు మరి ట్టుకోలేని వెలితి తీర్చుకోడానికి కాబోలు, చర్చిల్ తిక్క రిగినప్పుడెల్ల పెరటిలో తాపీపని చేస్తుంటాడు. పిల్లలు య్యాలజంపాల ఊగుతున్నా, రంకుల (రంగుల?) రాట్నంపై గిరగిరతిరుగుతున్నా వారిలో కలిసిపోకుండా మన నెహ్రూ కాలు కట్టివేసుకోలేడు. కోపగించుకోవడం తగదని కోపంతో చెప్పగల సత్తా ఆయనకున్నది కూడా.

శరీరంతోపాటుగానో, దానికంటె వడిగానో మనస్సు ముదిమి తేలిపోయినవారికి శైశవవిలక్షణాలు శైశవావస్థ గడచినవారిలో కానరావడం విడ్డూరంగా తోస్తుంది. ఈ ముదిమనస్సువారు మగవారైతే "ఔరా! చిన్నతనం ఇంకా వదలనేలేదు" అని ముక్కుపై వేలు వేసుకుంటారు; ఆడవారైతే "ఓయమ్మ! ఇవేమి బుద్ధులు!!" అని బుగ్గలు నొక్కుకుంటారు. గోచిపెట్టుకునే యీడులో గోలీకాయ లాడాలి

కాని, గడ్డాలూ, మీసాలూ వచ్చినతర్వాతకూడానా? నిజమే! ఈ ప్రశ్నలోని తర్కాన్ని కాదనలేము. తర్కం మానవునిచేతిలో కత్తివంటిది. దానితోనే అతడు మార్గాన్ని నిష్కంటకంచేసుకుంటూ సభ్యతాపథంవెంట పురోగమించ గలిగాడు. దాన్ని మినహాయిస్తే అతడికీ, పశురానికీ తేడాయే వుండేదికాదు. అయినా, తర్కంనడిపించే దారివెంట ముక్కుకు సూటిగా నడిస్తేమాత్రం వెళ్ళి చేరవలసింది బ్రహ్మంగారి మతాన్ని; తప్పితే, పిచ్చి ఆసుపత్రిని.

ఇల్లువాకిలి నాది, యిల్లాలు నాదనుచు
యేల భ్రమసితివయ్యో మనసా!
కాలుని వలలోను కానకను చిక్కితివి
కడతేరుటే ట్రోవమనసా!
తనయులు, చుట్టాలు తనవారు యని నమ్మి
తలపోయకే వెర్రి మనసా!
తనువు విడిచి వెళ్ళే సమయంబులోపల
తనవెంట రారైరి మనసా!

అని పోతులూరి వీరబ్రహ్మంగారు చేసిన బోధనలోని తర్కాన్ని కాదనడం మన తరమా?

కండ లెముకలు నెత్తురు గలిగి తనువు
మూత్ర మలములతోనుండు ముట్టరాక
కామజుని బాణమం చూసగల్గి జెడును
ఆస బాసెడి విధము నరయు వేమ!

అని వేమనయోగి చేసిన హెచ్చరికలోని హేతువాదమైనా

బలహీనమైందా? అయితే, బ్రహ్మంగారి తత్త్వాలను విని, వేమనశతకాన్ని చదివి, సంసారాన్ని రోసి, సన్న్యాసులలో కలిసిపోతున్నవా రెందరున్నారు? తర్కాన్ని తు. చ. తప్పకుండా పాలించాలంటే,సన్న్యాసం తప్పినా, ఉన్మాదం తప్పదు. రెండువైపుల పదనుగల మేధకు తర్కంతో జరిగే పెళ్లి తరచు పిచ్చిగా మారుతుందని ఆలివర్ వెండల్ హోమ్స్ చెప్పిన మాట బ్రతుకును కాచి వడపోసినతర్వాత చెప్పిన మాటే.

కొన్నికొన్ని సందర్భాలలో తర్కం భస్మాసుర హస్తాన్ని మించిపోగలిగింది కాబట్టే దాన్ని దేవుని నెత్తినే పెట్టడానికి మిస్టర్ గిరీశం ప్రయత్నించాడు. "యోవ్‌యా? దేవుడా? నా మనస్సు యిండిపెండెంటుగా సృజించావా? లేక, డిపెండెంటుగా సృజించావా?" అని ముందు తానొక ప్రశ్న వేస్తాడట. ఆ తర్వాత "యిండిపెండెంటుగా అయితే, నా యిష్టమొచ్చిన పనల్లా నేను చేశాను—నువ్వెవరు అడగడానికి? యిలాంటి చిక్కులు పెట్టావంటే హెవెన్‌లో చిన్న నేషనల్ కాంగ్రెస్ వొకటి లేవదీస్తాను" అని బెదిరిస్తాడట. "లేక, నన్ను డిపెండెంటుగా చేశావూ? అహ్లాగయితే నువ్వే నాచేత పాపం చేయించావు గనక నీకే ఆ శిక్ష కావలసింది. దేర్ ఫోర్ చలో, నరకానికి చలో" అని ఆజ్ఞాపిస్తాడట.

సందర్భాసందర్భాలు తెలియని, సమయాసమయాలను గుర్తించని హేతువాదం కేవలం కుక్కమూతి పిందెలను

వేస్తుందని తెలియబట్టే మహాపురుషులైన వారుకూడా అవసరమైనప్పుడు స్వవచనవ్యాఘాతాని కేమి, పరస్పరవిరుద్ధ ప్రవర్తనకేమి వెరవరు. పాత మాటనో, పాత చేతనో భూమి తలక్రిందులైనా పట్టుకు వ్రేలాడతామనే వారు కొద్దిబుద్ధిగలవారేనని ఎమర్సన్ చెప్పగా, దాన్ని సాక్షాత్తు గాంధీజీ బలపరిచాడు. పిచ్చివాడివేషంలో "అన్నమైతే నేమిరా, మరి సున్నమైతే నేమిరా. అందుచేతనే ఈ పాడు పొట్టకు అన్నమే వేదామురా!" అని యుగంధరమంత్రి చెప్పింది పిచ్చిమాట కాదు. ఆ మాటప్రకారం వ్యవహరిస్తేనే ఈ జగన్నాటకం నడవడం.





## రూపం, గుణం

"భార్యా రూపవతీ శత్రుః" అన్నారు పెద్దలు. ప్రపంచం తలకిందులైనా, ఇటు సూర్యుడు అటు పొడిచినా, పిన్నలు ఈ మాట వొప్పుకోరు. మళ్లీ మాట్లాడితే ఈ మాట చెప్పే పెద్దల పెద్దరికాన్నే వొప్పుకోరు. "ఆఁ! ఏమిపెద్ద ?— తాటిచెట్టు పెద్ద!" అని చులకనచేస్తారు. "కాకిముక్కుకు దొండపండు" తగిలించుకున్నవారే చక్కని పెళ్ళాం చేటు తెస్తుందని చెప్పివుంటారని చప్పరించివేస్తారు. "ఇల్లు యిర్కటం, ఇల్లాలు మర్కటం" కావాలని కోరుకునేవారి బ్రతుకు ఒక బ్రతుకేనా అని పెదవి విరుస్తారు. మరీ బరి తెంచుకున్నవారైతే "కురూపి యేమి చేస్తున్నాడంటే సురూపాలన్నీ లెక్కపెడుతున్నాడు" అని వసంతం పడతారు.

ఈ పిన్నలను స్త్రీజాతి చాలావరకు సమర్థిస్తుందనే చెప్పాలి. "కోడలు నలుపైతే కులమెల్లా నలుపు" అనే సామెత ఎక్కువగా ఆడవారినోటనే వినవస్తుంది. మొత్తంమీద మగువల మొగ్గు అందచందాలవైపుకే. "ఆడది మెచ్చిందే అందం" అనే లోకోక్తి నిర్నిమిత్తంగా పుట్టలేదు.

రూపురేఖలకే పిన్నలు మార్కులిస్తే, పువ్వుబోడులు వారితో "కంకరెంట్ జడ్జిమెంట్" చెబితే, పెద్దలసుద్దులు మరి గాలికి పోవలసిందే. అయినా, "భార్యా రూపవతీ శత్రుః" అనే సూత్రంలో పీసంవాసి నిజం లేకపోలేదు. కేవలం రూపమే వుండి, గుణం లేనిదైతే—హరిహరీ!—ఆ భార్య పగవాడికైనా వద్దు. తార చక్కని చుక్క. ఆమె అందం బృహస్పతినిపోలిన బ్రహ్మర్షినికూడా బుట్టలో పెట్టింది. కాని, గుణంతక్కువైన తారను కట్టుకుని ఆ దేవర్షి ఏమి సుఖపడ్డాడు? ఆమెవల్ల చివరికి తన దేవగురుత్వానికే నగుబాట్లు తప్పలేదు. కాని, బృహస్పతి బ్రతుకును బుగ్గి చేసింది తార రూపం కాదు; ఆమె గుణం. ఆమె జగన్మోహిని కాక, జుగుప్సాకరమైన రూపంకలదైనా ఆమె వంకరబుద్ధి వంకరగానే వుండేది. కాగా, అట్టి స్థితిలో ఆమెకు వంకర నడక బహుశా సాధ్యపడేదికాదు. రూపసి కాకపోతే చంద్రుడు ఆమె వలలో పడేవాడుకాడేమో! ఈ మాటను ఇక్కడ కొంత సందేహంతో చెప్పడం కురూపానికైనా కక్కుర్తిపడి, "నా కళ్ళతో చూడు" అనే సరసులు కొందరు కలరు గనుకనే. ఏమైనా, కురూపసురూపాలకు,

సద్వ్యర్తదుర్వ్యర్తనాలకు అవినాభావసంబంధం కలదని ధ్వనించడం శుద్ధ తప్పు. పాతివ్రత్యానికి ప్రసిద్ధికెక్కిన నారీమణులలో రూపలావణ్యాలు కొరవడినవా రెవరు? సచ్చరిత్రగా సంచరించడంలో సౌందర్యవతి ఎక్కువగా ప్రలోభాలకు, లేదా, పరీక్షలకు తాళవలసివస్తుందనడం వాస్తవమే. అంత మాత్రంచేత అందాలబరణిని ఆలుగా తెచ్చుకోవడం పాముతో చెలిమిగా చెప్పడం భావ్యం కాదు. ఎదుర్కోవలసిన ప్రలోభాలే లేనప్పుడు, నిలవవలసిన పరీక్షలే లేనప్పుడు దారి తప్పకపోవడంలో గొప్ప లేదు. వెంటపడినా శూర్పణఖను వలచినవారే లేరు; జానకికే అగ్నిపరీక్ష అనివార్యమైంది.

పరిశీలనకు నిలవని "భార్యా రూపఃవతీ శత్రుః" అనే ఈ సూక్తి చెప్పింది బృహస్పతే కావచ్చు. తప్పితే, ఆయన పడినట్టి దురవస్థలోనే పడిన మరొకరు చెప్పివుండాలి. సరిగా మన దేవగురువుకు పట్టిన దురవస్థను పోలింది కాకపోయినా, కొంచెం కడిమెడంగా అట్టిదే జపాన్ ప్రభుత్వపు ఖనిజసంస్థలో పద్దులగుమాస్తా ఛివిచీ హానాఫ్యూన్‌కు పట్టినట్టు నేటి పత్రికలనుబట్టి తెలుస్తున్నది. అతడి భార్యారత్నానికి ఒక చంద్రుడు తటస్థపడలేదుగాని, అందకత్తెగా అందాజైన చిలకలకొలికిని ఏరి, కోరి చేపట్టడం అతడికి తద్దినం కొని తెచ్చుకోవడమే అయింది. గుమాస్తాకు ఏపాటి జీతం వస్తుంది? అయినా, అందాలకుప్పగా దేశం మొత్తంపై ఎన్నికైన పడతిని పెండ్లాడాడు. అతడి జీతం

రాళ్లు ఆమెకు ఒక నెల ఫేస్ క్రీమ్, పౌడర్, లిప్‌స్టిక్ వగైరాలకైనా చాలవు. ఒకసారి "హెయర్ డూ" కైనా చాలకపోవచ్చు. అందువల్లే కాబోలు, కొన్ని కోట్లు కొట్టి వేశాడు; కొట్లో కూర్చున్నాడు.

ఏమాట కామాట చెప్పాలి - ఆమె ఫ్యాషన్ల కోసమే అతడు ప్రభుత్వ ధనాపహరణ చేశాడని నేను ఊహచేయడం తప్పే కావచ్చు. అతడే విలాసపురుషుడై వుండవచ్చు. "అప్పు చేసినా నిప్పంటి సారా త్రాగా" లనేది అతడి జీవిత సిద్ధాంతమే అయివుండవచ్చు. అయితే, తప్పెవరిదో తబ్సీలుగా తెలియకపోయినా ఆమెపైనే నేను నెపం వేయడానికి కారణం లేకపోలేదనుకుంటాను.

మన గుమాస్తాగారి గృహిణి దేశం మొత్తంపై అందాలరాణిగా బహుమానం అందుకున్నా, ఆ ఘనతకు నిజంగా ఆమె పాత్రురాలు కాకపోవచ్చు. ఏదైనా పోటీ జరిగినప్పుడు దానిలో పాల్గొనేవారిలో మాత్రమే అగ్రస్థానం నిర్ణయిస్తారు. ఆ తీర్పు వారికే పరిమితం. పోటీలో పాల్గొనని అసంఖ్యాకులకు అది వర్తించదు. అయితే, దేశం మొత్తంపై కోరినవారెవరైనాసరే పోటీలో చేరవచ్చునని ఆదిలో చెప్పివుంటే, చేరదగువారందరు చేరినట్టే అంతానికి తీర్మానానికి వస్తారు. దీన్ని పురస్కరించుకునే "దేశం మొత్తంపై" ఫలితం అంటూ తమ నిర్ణయాన్ని ప్రచురం చేస్తారు. వాస్తవానికి అది పోటీ మొత్తంపై ఫలితమే. సత్తావుంటే పోటీలంటే కంటగించుకునేవా రెందరెందరో వుంటారు.

"వీరితోనా నేను పోటీ చేసేది!" అని తక్కిన పోటీదార్ల పట్ల న్యూనభావం వుండవచ్చు. "వీరా నన్ను పరీక్ష చేసేది!" అని పోటీ నడుపుతున్నవారిపట్ల తిరస్కారవైఖరి వుండవచ్చు. "ఇంతా పోటీచేస్తే, ఈ మాత్రమేనా ప్రతిఫలం!" అని ఆశ చూపబడిన పారితోషికంపట్ల తృణీకారభావం వుండవచ్చు. "పోటీలలో నెగ్గనిదే నా ఘనతను లోకం గుర్తించదా! సరే-చూద్దాం!" అన్న అహమహమిక వుండవచ్చు. లేదా, భయమో, సంకోచమో, వినయమో వినమ్రతతో అడ్డురావచ్చు. కారణాలేవైనా పసగలవారిలో పెక్కుమంది పోటీల చాయలకైనా వెళ్ళరు. పోటీపేరు చెప్పగానే పెడముఖంపెట్టడం ఇంతగా జరుగుతుంది కనుకనే మన గుమాస్తాగారి గృహిణీమణి అందాలపోటీలో నెగ్గినా, దేశం మొత్తంపై నిస్సంశయంగా సుందరాంగి కాకపోవచ్చు. అయినా, తాను అట్టిదానినేనన్న అతిశయం పోటీఫలితం విన్న మరుక్షణంనుంచీ ఆమెకు కలగడానికి వీలున్నది.

మరొక విషయం: దేనికైనా పోటీ అని పేరు పెట్టగానే దానిలో చేరడానికి చాలామంది సంకోచిస్తారు. ఇక, అది ఆడవారి అందచందాలపోటీ అయితే, సిగ్గు బిడియాలు తక్కువైనవారు తప్ప తక్కినవారు దానిలో పాల్గొనడం సాధారణంగా జరగదు. సుందరాంగికి తన సౌందర్యజ్ఞానం వుండవచ్చు. మరింత చక్కని చుక్కలా కనబడాలని ముప్పొద్దులా ముస్తాబుచేసుకోవచ్చు. "దిదిమి దీపం పెట్టుకోవచ్చు" అని తననుగురించి ఇరుగు పొరుగు అమ్మలక్కలు చెప్పుకుం

టుంటే విని, విననట్టు నటిస్తూనే, ఉప్పొంగవచ్చు. దారిని నడుస్తుండగా కళ్ళన్నీ తనపైనే పడితే సిగ్గు బిడియాలు ముప్పిరిగొంటున్నా లోలోపల సంతోషపడవచ్చు. కాని, "నన్నుచూడు; నా అందం చూడు" అన్నట్టు వెకిలిగా ప్రవర్తించదు. అంతే చేస్తే ఆమె సంస్కృతీ సౌశీల్యాలనో, కనీసం ఆమె కుటుంబసంప్రదాయాలనో శంకించవలసివస్తుంది. అందచందాల పోటీకి వెళ్ళడమంటే "నన్ను చూడు; నా అందం చూడు" అనడమే; తాను జగదేకరంభనని విర్రవీగడమే; గుణం తక్కువని కచ్చితంగా చాటుకోవడమే. కొట్లోపడిన జపాన్ గుమాస్తా బ్రతుకు కలా తెల్లవారడానికి అందాలపోటీ భార్యే కారణమని ఇందుకే నాకు మున్ముందుగా తట్టివుండవచ్చు. "చిలుక తన ముద్దేకాని ఎదటి ముద్దు కోరదు" కదండీ!

అయితే, ఒక విషయాన్ని నిరభ్యంతరంగా నే నంగీకరిస్తాను. ఏవైనా వొడుదుడుకులు వచ్చి సంసారం చట్టుబండలైపోతే ఇల్లాలిని తప్పులెన్నడం లోకం రివాజు. కాపురం కడగండ్లపాలు కావడానికి గృహస్థే బాధ్యుడని స్పష్టంగా తెలిసిన సందర్భాలలోకూడా "అతడికి బుద్ధిలేకపోతే, ఆవిడకైనా జ్ఞానంలేకపోయిందా?" అనడంకూడా కద్దు. ఎంతైనా ఈ లోకం పురుషలోకం. అందువల్లే "ఆడదాని బుద్ధి అపరబుద్ధి", "ఆడదాని మాట నీళ్ళమూట", "ఆడదానిచేతి అర్థమూ, మగవానిచేతి బిడ్డా బ్రతకదు" మొదలైన సామెతలు ప్రచారంలోకి వచ్చాయి. "విస్సన్న

చెప్పిందే వేద" మన్నట్టు ఇట్టి సామెతలను నమ్ముకుని గార్హస్థ్యజీవితం కష్టభూయిష్ఠమైన ప్రతిసారీ, అది భగ్నమై పోయిన ప్రతిసారీ ఆ దోషాన్ని గృహిణికే అంటగట్టడం విజ్ఞత కాదు. ఇక, భార్య రూపసి అయినంతమాత్రంచేత ఆమె పరమశత్రువుకాగలదనడం కేవలం మూర్ఖత్వం. డెస్డిమోనా మహారూపసి. రూపంకంటెకూడా ఆమె గుణం దొడ్డది. ఒథెల్లో ఆమె కారణంగా మనోవ్యాకులత చెందితే, ఆమెను హత్యచేసి, తాను హత్యచేసుకుంటే, అది ఆమె తప్పుకాదు; ఇయాగో చాడీలకు చెవినొగ్గిన అతని బుద్ధిమాంద్యం తప్పు.





# పదవీ వ్యామోహం

"మంత్రిపదవి కేవలం బందిఖానా. అది వార్తిముళ్ళపాద. అయినా, దానికోసం కొందరెందుకో పడి ఛస్తారు" అని ఒక పెద్దమనిషి విస్తుపోతున్నాడు. "అంతే లేవయ్యా! అందని ద్రాక్షపళ్లు పులుపు" అని ఈ పెద్దమనిషి మాటను త్రోసివెయ్యడానికి ఈయనా ఒకమంత్రే. పైగా, ప్రధాన మంత్రి. ఏ రాష్ట్రానికో, సంస్థానానికో కాక, ఒక దేశానికే "బడా వజీర్." నిజానికి ఈయనపేరు మధ్య పెట్టవలసినపని లేదు. ఈ పెద్దమనిషి మరెవ్వరో కారు; మన ప్రధాని పండిట్ నెహ్రూయే.

"అందరు అందలమెక్కితే మోసేవారెవరు?". ఈ సంగతి అందరికంటె అధికంగా అందలమెక్కేవారికే ఆకళింపు. అందువల్లనే పల్లకీ యెక్కితిరిగే ప్రతిపెద్దమనిషీ అంతకంటె బుద్ధితక్కువపని మరి వుండదంటాడు. "చెడ్డ కుదుపు. కీలు

కీలూ కదిలిపోతుంది. వొళ్ళు హూనహూనమైపోతుంది'' అని తెగ సణుగుతాడు. ఓపికవుంటే కాలినడకనుమించి మరి హాయిలే దంటాడు. కాలికొద్దీ నడిచినవారికి కరకర ఆకలి వేస్తుం దంటాడు. వారే సుష్టుగా భోంచేసి, సుఖంగా నిద్ర పోగల రంటాడు. ఆరోగ్యభాగ్యం వారిదే నంటాడు. "అయితే, తమ రెందుకు నడవరు?" అనే పోకిరీప్రశ్న వస్తుందేమో నని దానికి ముందుగానే జవాబులు ఆలోచించిపెట్టుకుంటాడు. కాలినడకను తిరగడానికి తనకు దార్ఢ్యం తక్కువనడానికి వీలులేకపోతే, వంశమర్యాదలను, కుటుంబసంప్రదాయాలను కాపాడ్డానికి తాను లేనిపోని అవస్థలు పడవలసివస్తున్నదని చెప్పి తప్పుకుంటాడు. లేదా, చాలా లెక్క తిరగాలనీ, చక చక తిరగాలనీ, చావుకు వస్తున్నా పల్లకీ యెక్కడం తనకు తప్పడంలేదనీ సర్దుకుంటాడు. వెతికే కుంటిసాకు ఏదైనప్పటికీ అందలంనుంచిమాత్రం అడుగు కిందపెట్టడు. పెళ్ళికి ఒక్కసారి పల్లకీయెక్కి దిగినవాణ్ణి ముక్కాలు ముదుసలైనతర్వాత నైనా "తాతయ్యా! మళ్ళీ గోకోకం యెక్కుతావా?" అని కదిలించి చూడండి. "నాకు పిల్లనిచ్చే తలమాసినవా డెవడురా?" అని ముసిముసినవ్వులు నవ్వుతాడే తప్ప, "నాకు పల్లకీముచ్చట లేమిటిరా?" అనే ముక్క ఒక పట్టాన నోటవస్తుందేమో!

అందలమెక్కి కూర్చున్నవారు ప్రాయికంగాచెప్పే కబుర్లనే జవాహర్‌లాల్ చెబుతున్నాడనడం ఆయనపట్ల మహాపచారం చెయ్యడమే కావచ్చు. "నాపై ఎంద రెందరో

ఎన్నెన్నో ఆశలు పెట్టుకున్నారు. వారికి నేనెంత సేవ చెయ్యగలుగుతున్నాను?'' అని ఒకప్పుడైనా ఆత్మపరీక్ష చేసుకోగలవాడు కాబట్టి, తన ప్రధాన మంత్రిపదవి ఆయనకు నిజంగానే బందిఖానాగా తోస్తున్నదని, నిజంగానే ముండ్ల పొదవలె అది ఆయనకు బాధాకరమౌతున్నదని మనం అనుకోవచ్చు. కాని మానవస్వభావం, ప్రపంచంపోకడ క్షుణ్ణంగా తెలిసిన నెహ్రూకు ''పదవికోసం ఇంతగా కొందరు ఎందుకు తాపత్రయపడతారు?'' అని ఆశ్చర్యం కలగవలసిన పని సుతరామూ లేదు.

లింగభేదాన్నిబట్టి మానవులలో కొందరు స్త్రీలు కాగా, మరికొందరు పురుషులు. వయోభేదాన్నిబట్టి కొందరు పిన్నలు కాగా, మరికొందరు పెద్దలు. మేధలో భేదాన్నిబట్టి కొందరు సూక్ష్మగ్రాహులు కాగా, మరికొందరు మందబుద్ధులు. గుణంలో భేదాన్నిబట్టి కొందరు సజ్జనులు కాగా, మరికొందరు దుర్జనులు. స్థితిగతులలో భేదాన్నిబట్టి కొందరు భాగ్యవంతులుకాగా, మరి కొందరు బీదవారు. ఇట్టివే కాక, వ్యక్తిగత దృక్పథంవల్ల జరిగే విభాగాలు మరికొన్ని వుంటాయి. ఉదాహరణకు, అడాల్ఫ హిట్లర్ జాత్యహంకారంవల్ల మానవాళిని ఆర్య, అనార్యజాతులుగా విభజించేవాడు. హిట్లర్‌ను చంపి పుట్టిన డేవిడ్ మలాన్ శ్వేత, శ్వేతేతరజాతులుగా విభజిస్తున్నాడు. విదేశీయులు తమను పెట్టిన పాట్ల కారణంగా చైనావారికి మానవజాతి రెండు తెగలు; స్వదేశస్థులు, పరదేశాల దయ్యాలు. ఇంతదూరం పోకుండా నిత్య

జీవితానుభవంనుంచే ఒక దృష్టాంతం చూపవచ్చు. మోటారుకార్లపై తిరిగే వారికి పాదచారులందరు సరిగా దారివెంట నడవడమైనా తెలియని మొద్దుమొద్దు స్వరూపాలు; పాదచారులకు మోటారుకార్ల వారందరు కండ కావరంవల్ల కళ్లు మూసుకుపోయినవారు. ఈ వ్యక్తిగత విభాగాలు, ఇంతకుముందు చెప్పిన స్థూలవిభాగాలు కాక, సూక్ష్మంగా పరిశీలించగలవారు మానవులమధ్య మరెన్నో ఇతర విభాగాలు చేస్తారు. మానసికశాస్త్రవేత్త డాక్టర్ జంగ్ "ఇంట్రావర్ట్స్, ఎక్స్ట్రావర్ట్స్" అని మానవకోటిని రెండు శాఖలుగా విభాగించాడు. మరొక మానసిక శాస్త్రజ్ఞుడు "శాడిస్ట్స్, మాసోకిస్ట్స్" అని వేరొక విధమైన విభజన చేశాడు. సాంఘిక తత్వవేత్త కార్ల్ మార్క్స్ "తినే వారు, తినబడేవారు" అని వారిని రెండు తెగలుగా చీల్చాడు. ఇదేవిధంగా "నడిచేవారు, నడిపించేవారు", లేదా "పాలించేవారు, పాలించబడేవారు" అని మన మొక చీలికచేస్తే అదీ సత్యసమ్మతమైందే కాగలదు. నడిపించాలని, పాలించాలని పొద్దస్తమానం ఎవరి బుర్రెలో పురుగు తొలుస్తుంటుందో వారే మంత్రి పదవులకోసం తాపత్రయపడుతుంటారు.

నడిచేవారికి, నడిపించేవారికి ఎంత భేదంవుంటుందో భరతుని రామునితో పోల్చితే చక్కగా తెలుస్తుంది. తనకు రాజ్యం వలదని భరతుడనడానికి అన్నగారిపట్ల ఆయన కున్న పరమభక్తినే కారణంగా చెబుతారు. "అడవుల

రామచంద్రుఁడు జటాజినముల్ ధరియించియుండ నేఁ బుడమి భరించి భోగములు పొందఁగలాననె" అని ఆయన తల్లికి వేసినప్రశ్న భ్రాతృభక్తి ప్రేరితమైందే—సందేహం లేదు. కాని, "ఇట్టి చొప్పు లేయెడఁ గలవు?" అని ఆయన రెట్టించడానికి రాచరికపుచరిత్ర భ్రాతృద్రోహాలతో నిండి వున్నది. రామాయణంలోనే సుగ్రీవుడు వాలికి, విభీషణుడు రావణాసురునికి ద్రోహంచేశారు. "ఇంక నన్న మొగ మేమి తెలంగునఁ జూతు!" అని బాధపడిన పెద్దమనిషే కన్న తల్లిని పట్టుకుని "పాపపుం గడుపునఁ బుట్టి యీ భువన గర్వాక్షుఁ బాత్రుఁడనైతి రాక్షసీ!" అని పడదిట్టడానికి భ్రాతృభక్తికి మించిన బలీయకారణం మరొకటి లేకపోలేదు. ఒకరు చెప్పినట్టు నడచుకోవడమేతప్ప తనకుతానై అడుగు తీసి అడుగుపెట్టడమైనా కైకేయీపుత్రునికి చేతకాని పని. ఆయన తల్లిచాటునో, తండ్రిచాటునో, తాతచాటునో, మేన మామలచాటునో, అన్నచాటునో బ్రతికినవాడు. "ఎల్ల కాలం ఒకరిచాటు బ్రతుకేనా?" అని నానాతిప్పలు పడి తల్లి రాజ్యం సంపాదించిపెట్టినా దాన్ని యేలుకోవడం చేతకాకపోయింది. చేజిక్కిన రాజ్యాన్ని అన్నకు అప్పగింత పెట్టడానికి ఆయనను వెతుక్కుంటూ చిత్రకూటపర్వతానికి వెళ్లాడు. "అయినదేదో అయింది. నేను తిరిగివచ్చేవరకు నా తరఫున నీవే పరిపాలన సాగించు" అని అన్న చెప్పగా అందుకైనా తూఁగలేక, అన్న "హుకూమత్"కు గుర్తుగా ఆయన పాదుకలు అడిగితెచ్చుకున్నాడు. రాముడు మాత్రం

ఎక్కడవున్నా నడిపించగలవాడే. కనుకనే పితృవాక్యపరిపాలనపేరుతో రాజ్యాన్ని పరిత్యజించినా తన పాదుకల రూపేణా దాన్ని పరిపాలించగలిగాడు. చివరికి వానరుల మధ్యకు వెళ్ళినా వారికీ నాయకుడు కాగలిగాడు.

నడిపించే ప్రవృత్తిగలవారు పదవిని ఆశిస్తారనడం నిజమైనా, పదవికై ప్రాకులాడేవారందరు నడిపించగల దమ్ములున్నవారు కాకపోవచ్చు. పదవిని అంటి డాబుదర్పాలుంటాయి. వాటిని అంటించుకోడానికే కొందరు పదవులకై దేవులాడతారు. పదవి లేనినాటి "పెద్దాయి", అది అబ్బగానే "పెద్దయ్యగారు" అయిపోతాడు. నోరు విప్పితే బూతు వస్తుందేమోనని పెద్దయ్య నోటికి తాళం తగిలించుకుంటే అది గాంభీర్యంగా చెల్లుబడి అవుతుంది. నోటికి ఎంతవస్తే అంతా తడుముకోకుండా వాగివేస్తే అది గంగాప్రవాహాన్ని మించిన మహోపన్యాసంగా మెప్పుపొందుతుంది. మాట్లాడిన మాటలలో అవాకులు, చెవాకులున్నా ఫరవాలేదు. అప్పుడు గడసరితనానికి పేరుమ్రోగవచ్చు. మొత్తంపై పదవి కప్పిపుచ్చలేని లోపాలు బహుతక్కువ. అది పొందని భట్రాజు పొగడ్తలు లేవేమో! అయినవారికి మాత్రమే మేలుచేస్తే, "ఆశ్రితపక్షపాతి" బిరుదు పొందవచ్చు. దయాదాక్షిణ్యాలు లేకుండా ప్రతికక్షులను కాలరాచివేస్తే "అటునుంచి నరుక్కురాగల అద్భుతప్రజ్ఞాశాలి" అని కీర్తికెక్కవచ్చు. మేలు, కీడులలో దేన్నీ చెయ్యడం చేతకాకపోతే "ధర్మరాజు" అని

ఘనతగాంచవచ్చు. కీర్త్యపకీర్తులు కాసుచెయ్యవని తెగిస్తే వెనక మూడుతరాలకు, ముందు ఏడుతరాలకు తరగని భాగ్యాన్ని పోగుజేసుకోవచ్చు. ఇట్టి తుచ్ఛసంతృప్తులను వేటినో ఆశించి పదవికై అంగలార్చినా, దానిలో నిజంగా రాణించగలవారుమాత్రం నడిపించగల నేర్పుగలవారే. ఆ నేర్పుగల దిట్ట, హిట్లర్ చేసినట్లు, దేశాన్ని వినాశానికే నడిపించవచ్చు. అయినా నడిపించడంమాత్రం ఖాయం. ఆ నేర్పులేనివారికి పదవి మేకమెడచన్ను; లేదా, సుమతీ శతకకారుని కనకపుసింహాసనం.





# రంగు అద్దాలు

కాల్చిన వంకాయ పచ్చడి, పచ్చిపులుసు: ఇవంటే నాకు మహా యిష్టం. "జిహ్వ కొక రుచి; పుర్రె కొక బుద్ధి" అని పెద్ద లన్నారు గదా! ఒకరికి వంకాయ పచ్చడి యిష్టమైతే, ఇంకొకరికి బీరకాయపచ్చడి యిష్టం, మరొకరికి గోంగూరపచ్చడి యిష్టం. అసలు పచ్చడి అంటేనే సయించనివారుకూడా కొందరుంటారు. కూరలవిషయంలోనూ ఇంతే. ఒక్కొక్కరికి ఒక్కొక్కకూర యిష్టం. మళ్ళీ అందులో కొందరికి ఇగురుకూరలు కావాలి; మరికొందరికి పులుసు కూరలు కావాలి. కూరలో మస్తుగా కారం లేకపోతే కొందరు ముద్ద యెత్తలేరు. కారం ఏకాస్త యెక్కువపడినా, మరి కొందరి కళ్ళవెంట, ముక్కుళ్ళవెంట నీళ్లు కారతాయి. కొందరు తీపంటే చెవికోసుకుంటారు. మరికొందరికి కొంచెం తీపి తిన్నంతనే ముఖం కొడుతుంది. ఇంత దేనికి? ఉల్లిపాయ సంగతే చూడండి: దాని పేరు చెబితేనే కొందరికి నోరూరుతుంది. వీరు "ఉల్లి పది తల్లుల పెట్టు" అంటారు. రుచులన్నీ

ఉల్లిపొరలోనే పోగుపోసుకు వున్నాయని వీరి నమ్మకం. "ఉల్లివుంటే మల్లి వంటలక్కే" అనేది వీరే. నంజుకోడానికి రెండు ఉల్లిపాయ లిస్తే చద్దికూడైనా వీరికి అమృతోప మానమవుతుంది. కాని, కొందరికి ఉల్లివాసన అంతదూరాన తగిలినా కడుపులో దేవుతుంది. ఉల్లిని అంటరాని, ముట్ట రాని వస్తువుగా జమకట్టి, "ఉల్లి ముట్టనిదే వాసనరాదు" అని వీరు నీతిబోధ చేస్తారు. ఈ మాటనే మరింత కులాసాగా చెప్పాలంటే "ఉడకకే ఉడకకే ఓ ఉల్లీ, నీ వెంత ఉడికినా నీ కంపుపోదు" అంటూ పగలబడి నవ్వుతారు.

కాని, "లోకో భిన్న రుచిః" అన్నంతమాత్రాన కాల్చిన వంకాయపచ్చడిపై, పచ్చిపులుసుపై నా కున్న మక్కువకు కారణం తేలిపోదు. బంగాళా దుంప, పచ్చిబటానీ, టొమాటో, క్యారెట్ మొదలైనవి ఎక్కువ రుచిగల పదార్థాలని నా అభిప్రాయం. అయితే, వీటితో వండిన కూరలు తింటున్నప్పుడు రుచిగలపదార్థాలు తింటున్నానన్న సంతృప్తితప్ప, అంతకుమించి "కదలిక" (రియాక్షన్) నాలో కలగదు. ఇక, కాల్చిన వంకాయ పచ్చడినికాని, పచ్చి పులుసునుకాని వడ్డించుకోగానే చిన్ననాటి సముద్రస్నా నంతోపాటు, నాటి ఆనందానుభూతి జ్ఞాపకం వస్తుంది.

నా చిన్నతనంలో ఒక మాఘపౌర్ణమికి మా పల్లెనుంచి సముద్రస్నానానికి బందరు వెళ్ళాము. బాడుగకు మా

అమ్మమ్మ ఒక బండి కుదిర్చింది. అది చోద్యమైన బండి. దాని దాపటిని ఒక దున్నపోతు; వెలుపటిని ఒక గొడ్డుబోతు ఆవు. నాకు తిన్నగా తెలియదు గాని, తక్కినవాటికంటె ఒక రూపాయి తక్కువకు వచ్చిందనే మా అమ్మమ్మ ఆ బండిని కిరాయికి కట్టించిందని అనుకుంటాను. ఏమైతేనేమి దానిలో నేను, నా తమ్ముడు, మా అమ్మ, మా పిన్ని, ఆవిడ బిడ్డలు, మా అమ్మమ్మ, మా చిన్నమేనమామ, ఇంచుమించు పదిమంది బయల్దేరాము. భోజనాలైనాక రాత్రి ఎనిమిది, తొమ్మిది గంటలకు బయల్దేరిన మా బండి తెల్లవారుఝామున నాలుగైదుగంటలకు చిలకలపూడి చేరుకుంది. అక్కడ రోడ్డు దిగి, ఇసుకపర్రలో మూడునాలుగు మైళ్ళు వెడితేనే గాని సముద్రంవద్దకు చేరుకోము. రోడ్డుపై నడిచినంతవరకు దున్నపోతు, గొడ్డుబోతు ఆవు కలిసి, బండిని ఎలాగో లాగాయిగాని, ఆ తర్వాత అవి అడుగుతీసి అడుగుపెట్టడమే కష్టమైపోయింది. అందువల్ల మేము కొందరం బండి దిగి నడిచాము. సూర్యోదయంవేళకు సముద్రతీరం చేరుకుని, ఏ డెనిమిదిగంటలకు స్నానం పూర్తిచేసుకున్నాము. తర్వాత మేము బందరు చేరేసరికి పది కావచ్చింది. అప్పుడు బండిని ఒకరి పంచను నిలిపి, వారి పెరటిలో వంట ప్రారంభించాము. అప్పటి పరిస్థితిలో సాధ్యపడగలవంట అత్తెసరు అన్నం, కాల్చిన వంకాయ పచ్చడి, పచ్చిపులుసు మాత్రం. గతుకుడురోడ్డుమీద బండి

ప్రయాణం, ఇసుకలో కాలుసాగని నడక, సముద్రంలో పక్కాగంట ఈత, తిరిగి ఇసుకలో కాళ్ళీడ్చుకుంటూ నడక, ప్రొద్దెక్కిపోవడం, కరకర ఆకలి: అప్పుడు ఆ కాల్చిన వంకాయపచ్చడే, ఆ పచ్చిపులుసే పంచభక్ష్యపరమాన్నాల కంటె నాకు మధురాతిమధురంగా తోచింది!

ఇప్పటికీ నాకు కాల్చిన వంకాయపచ్చడిపైన, పచ్చిపులుసుపైన చాలా మక్కువ వుండడానికి నాటి మధుర స్మృతే కారణ మనుకుంటాను. ఇది ఒక్క నాకే కాదు; అందరికీ వర్తిస్తుంది; ఒక్క జిహ్వకే కాదు; జీవితానికీ వర్తిస్తుంది. ఒక వస్తువుకైనా, ఒక వ్యక్తికైనా, మనమిచ్చే విలువ ఆ వస్తువు స్వతస్సిద్ధమైన గుణంపైగాని, ఆ వ్యక్తి స్వతస్సిద్ధమైన స్వభావంపైగాని ఆధారపడివుండదు. మనకూ దానికీ, లేదా మనకూ అతనికీ వున్న అనుబంధంపై ఆధారపడివుంటుంది.

మనకు ఆలోచనాశక్తి వున్నదని అనుకుంటాము; వివేచన పటిమ వున్నదని గర్విస్తాము. కాని, దేన్నికూడా మన అనుబంధం, మన అనుభూతి అనే రంగుటద్దాలగుండా తప్పితే చూడనే లేము. ఇందువల్ల కొన్నింటిలో లేని అందం, లేని రుచి, లేని గుణం మనకు కనబడవచ్చు. ఇంతేకాదు. రుచియైనదానిలోనే అరుచి, అందమైన దానిలోనే వికారం, గుణంవున్నచోట అవగుణం కనబడవచ్చు. మన అనుబంధం విడిచి, మన అనుభూతిని వదిలి, దేనికీ

విలువ కట్టనేలేము. ఏపిల్లికైనా పాలంటే యిష్టమే! కాని, తెనాలిరామలింగని పిల్లి పాలను చూడగానే బెదిరి పారి పోవడమేమి? ఒకసారి వేడివేడిపాలలో మూతిపెట్టడంవల్ల దాని నాలుక చుర్రున కాలడమే.

పరిశీలించి చూడముగాని, మన ప్రతి యిష్టానికి, అయిష్టానికి, ప్రతి ప్రేమకు, విద్వేషానికి మన అనుభూతిలోనే, జీవితంలోనే అంతర్గర్భితమై ఏదో ఒక కారణం వుంటుంది. ఇందుకు నిదర్శనంగా హిట్లర్ చరిత్రనే చూడండి. అతడికి యుద్ధం అంటే తగని ప్రేమ; తెంపులేని భక్తి. నా దృష్టిలో, మీ దృష్టిలో యుద్ధం ఒక మహామారి కావచ్చు. సస్యశ్యామలమైన భూతలాన్ని శ్మశానవాటికగా మార్చివేస్తుందని దాన్ని మనం నిరసించవచ్చు. ఆశలతో, ఆశయాలతో, కలలతో, కల్పనలతో భావిజీవితాన్ని సుందరంగా, మధురంగా చిత్రించుకుని, దాన్ని కైవసంచేసుకోడానికి తమలో గర్భితమై వున్న శక్తులను ప్రదీప్తం చేసుకుంటున్న యువజనులను వేల కొలదిగా, లక్షలాదిగా కబళించి వేస్తుందని దాన్ని మనం విద్వేషించవచ్చు. ఎందరినో అనాథులను చేసి, మరెందరినో నిరాధారులుగా నిలిపి, సుఖంతో, ఆనందంతో, జ్యోతిర్మయంగావున్న గృహాంతరాళాలను దుఃఖంతో, దైన్యంతో అంధకారబంధురం చేస్తుందని మనం దాన్ని విషతుల్యంగా చూడవచ్చు. కాని, హిట్లర్‌కుమాత్రం యుద్ధంలో ఏదో అందం, ఏదో ఆకర్షణ, ఏదో సమ్మోహనశక్తి కనబడేది.

యుద్ధవ్యవస్థ లేకపోతే, మానవవ్యవస్థే లేదని అతడు విశ్వసించేవాడు. మానవజాతి పురోభివృద్ధికి యుద్ధ మొక మహత్తర సాధనమని అతడి నమ్మకం. మానవుని నిగూఢశక్తు లన్నింటిని యుద్ధం వెలికి తెస్తుందని అత డుద్ఘాటించాడు. యుద్ధపరికరాలు సేకరించడం, యుద్ధసన్నాహాలు సాగించడం, యుద్ధరంగా లేర్పరచడం, ఒక్కమాటలో, యుద్ధాన్నే అతడు తన జీవిత పరమావధిగా చేసుకున్నాడు. హిట్లర్ ఈ చిత్తవృత్తికి కారణ మేమిటి?

"నా" అనేవారు లేక, పనిపాటలు లేక, తినడానికి తిండి, కట్టుకోడానికి గుడ్డ, తలదాచుకోడానికి చోటు లేక, ఏకాకిగా, బికారివలె అతడు తిరుగుతున్న రోజులలో ప్రథమ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. అప్పుడు ఆ యుద్ధం ప్రారంభం కావడం హిట్లర్‌కు వరదవెంట కొట్టుకుపోతున్న వానికి తెప్పకొయ్య దొరికినట్టే అనిపించింది. ఆక్షణంలో అతడు తన ఆనందం పట్టలేక, కళ్ళవెంట జొటజొట నీళ్లు కార్చుతూ, నిలబడినచోటనే మోకరిల్లి, భక్తియుతంగా, కృతజ్ఞతాపూర్వకంగా పరమేశ్వరునికి నమస్కరించాడు. అంతవరకు హిట్లర్ ఒక కీటకం. సైనికుడుగా చేరినంతనే అతడుకూడా ఒక మనిషి అయ్యాడు. హిట్లర్‌కు యుద్ధం జీవితపరమావధి కావడంలోని కీలక మిదే.

విపరీత పరిస్థితులలో పుట్టి, పెరిగి, విపరీతపు చావు చచ్చిన విపరీతవ్యక్తిగా, పోనీ, హిట్లర్ జీవితానికి మనం విలువ

నివ్వకపోయినా, ప్రపంచపుమన్నన పొందుతున్న ఇతరులైనా సమస్తాన్నీ స్వీయానుభవం రంగుటద్దాలగుండా చూచేవారే. చిన్నతనంలో దారిద్ర్యాన్ని వెళ్ళబోసినప్పుడు పులిసిన "బ్రెడ్" (రొట్టె)తో షేక్స్పియర్ కడుపునించుకోవలసి వచ్చేది కాబోలు — రోతగించుకోకుండా రొట్టెప్రసక్తి ఆయన నాటకాలలో లేనేలేదు. సుప్రసిద్ధుడైన స్వీడిష్ నాటకకర్త స్ట్రిండ్‌బర్గ్ స్వీయగార్హస్థ్య జీవితానుభవాల కారణంగా మొత్తం స్త్రీజాతి విద్వేషకుడైనాడు. షేక్స్పియర్ నాటకాలంటే టాల్‌స్టాయ్‌కి ఎంతమాత్రం గిట్టకపోవడానికీ, ప్రత్యేకంగా కింగ్ లీర్ నాటకాన్ని, దానిలో లీర్ పాత్రను ఆయన దుయ్యబట్టడానికీ తన జీవితవైఫల్యాన్ని ఆ పాత్రలో చూచుకున్నందునే అని చెప్పేవా రున్నారు. విదేశాలదాకా పోవడం దేనికి? మన దేశస్థుడు, మన కవిసార్వభౌముడు శ్రీనాథునే చూడండి. జొన్నన్నం తన గొంతు పట్టుకొంటుంది కాబట్టి—

జొన్నకలి, జొన్నయంబలి,
జొన్నన్నము, జొన్నపిసరు, జొన్నలె తప్పన్
సన్నన్నము సున్నసుమీ
పన్నగ౯ బల్నాటిసీమ ప్రజ లందఱకున్

అని గేలిచెయ్యడంతోనైనా ఆగలేదు. "తింత్రిణీ పల్లవయుక్తమా నుడుకుబచ్చలిశాకము జొన్నకూటితో మెల్లనయొక్క ముద్ద దిగమ్రింగుము నీ పస కాననయ్యెడిన్" అని

దేవుడినే సవాల్ చెయ్యడంతోనైనా ఆగలేదు. మొత్తం పల్నాటిసీమను, అక్కడి ప్రజను "అంగడియూరలే"దని, "శుచిత్వమేమిలే"దని, "అంగన లింపులే"రని, "ప్రియమైన వనంబులు లే"వని, మరేమో లేవని తెగనాడాడు. అక్కడ "రంభమైన సేకులు వడుకు"తుందట. "వసుధేశుడైన దున్ను"తాడట. పల్నాటివారు సోమరితనం చూపని ఈ మహాపాపం కారణంగా రసికుడు పల్నాడు పోడట. ఎంత సరసమైనమాటో చూడండి! ఇక, అవతారపురుషుడుగా చెప్పబడే మన పరశురాముడైతే ఒకరాజు పుత్రులు తన తండ్రిని చంపిన నేరానికి రాజలోకంపైనే పగబూని, వారి పుత్రెలతో స్వర్గానికి మెట్లు కట్టేవరకు యెత్తిన గొడ్డలిని దించలేదు.

కేవలం వ్యక్తులవిషయంలోనేకాక జాతులవిషయంలో కూడా వాటి అనుభూతులే వాటి అభిరుచులను, అభిప్రాయాలను నిర్ణయిస్తాయి. దృష్టాంతానికి, చైనాలో ఇటీవలివరకు సైనికవృత్తిని నీచాతినీచమైనదాన్నిగా పరిగణించేవారు. సైన్యంలో చేరడం శిష్టసంఘానికి దూరమైపోవడమే. ఎవరు జీతభత్యాలిస్తే వారిపక్షాన పోరాడ్డం, ఎవ రెక్కువ లంచపంచాలుపెడితే వారిపక్షానికి తిరిగిపోవడం, నిరాయుధ ప్రజలపై, నిస్సహాయజనపదాలపై పడి దోచుకోవడం— ఇదే సైనికులైనవారికి పరిపాటిగా వుండేది. అయినప్పుడు ఇదివరకు చైనాలో సైనికుని ఒక చోరునిగా, హంతకునిగా

కంటగించుకునేవారంటే దానిలో వింత లేదుగదా? చైనా సైనికుల ఈ ప్రవర్తన పోయిన పది, పదిహేనుసంవత్సరాలలో పూర్తిగా మారినందున ఇప్పటికి వారిపట్ల ప్రజాభిప్రాయం కూడా బహుశా మారిపోయేవుంటుంది.

ఇది నీతిబోధకవ్యాసం కాదు గాని, మనం దేన్ని హర్షించినా, మరి దేన్ని విద్వేషించినా, మన అనుబంధాలను అధిగమించి, మన అనుభూతులకు అతీతంగా వుండి, ఆ కార్యం చేస్తున్నామా అనే ఆత్మపరీక్ష అవసరమేమో! ఇది వున్ననాడు తొందరపడి, ఎవ్వరినీ "తను మునిగింది గంగ; తను వలచింది రంభ" అని అవహేళన చెయ్యము.






# స్మారకచిహ్నాలు

లండన్ కౌంటీ కౌన్సిల్‌కు దివ్యమైన ఒక నియమం వున్నది. స్మారకచిహ్న నిర్మాణానికి ఈ పురపాలకసంఘం సమ్మతిని పొందవలసివుంటే ఎవరి స్మృతిచిహ్న నిర్మాణానికి ఉద్యమిస్తున్నారో ఆ మనిషి మరణించి అప్పటికి పాతిక సంవత్సరాలైనా గతించివుండాలి. లేకపోతే, కావలసిన సమ్మతి లభించదు. ఇంతవరకు ఒక్క పర్యాయమే ఈ నియమోల్లంఘన జరిగింది. అది బెర్నార్డ్ షా విషయంలో. ఆయన మరి కొన్ని నెలలకు జీవయాత్ర చాలిస్తాడనగా వెనక అడెల్ఫీలో ఆయనకు నివాసమైన ఒక భవంతికి "జార్జి బెర్నార్డ్ షా ఇక్కడ నివసించాడు" అని ఒక చంద్రశిలాఫలకం అమర్చడానికి ఆయన భక్తులు అనుమతి కోరగా అందుకు లండన్ కౌంటీ కౌన్సిల్ "వల్లె" అన్నది. షా నాటికి విగతజీవుడు కాకపోయినా, ఆయన స్థిరకీర్తినందినాడన్న

విశ్వాసమే దాని వల్లెకు మూలం. మనంకూడా ఈ విశ్వాసంలో భాగస్వాములమే. కాని, "షా కీర్తి తగ్గితే నా చెవి కోయించుకుంటాను" అని పందెంకడితే చెవిపోగల ప్రమాదం వచ్చినా రావచ్చునేమో చెప్పలేము. తాను షేక్స్పియర్‌తో సమానం ఉజ్జీనని, నాటకకర్తగా షేక్స్పియర్ ఒకవేళ కాస్తో కూస్తో మెరుగైనా ఆయనకంటె తాను చచ్చులేకుండా హెచ్చు మేధావంతుడనని బెర్నార్డ్ షా బల్లగుద్ది చెప్పకున్నా, తన కీర్తి తన తరంతర్వాత నిలవబోదేమోనన్న భయం పీడిస్తూనేవుండేది. షా తన వృద్ధాప్యాన్ని గడిపిన అయొ సెయింట్ లారెన్స్ గ్రామంలో ఆయన ఇరుగు పొరుగువాడైన యస్. విన్‌స్టెన్ వ్రాసిన పుస్తకం "డేస్ విత్ బెర్నార్డ్ షా"ను చదివితే ఒక్కొక్క సంవత్సరం పైబడినకొద్దీ ఈ భయం ఎంత హెచ్చిందీ తెలుస్తుంది. క్రొత్త తరంవారు నా పుస్తకాలను చదువుతున్నారా? నన్నుగురించి వారేమి చెప్పకుంటున్నారు? అసలు నా ఊసైనా వారు తెస్తున్నారా?—ఇట్టి ప్రశ్నలను షా తరచు వేస్తుండేవాడు. తన తరాన్నే కాక ఆ తర్వాత వాటినికూడా మురిపించి, వలపించి, తన కీర్తి స్తంభాన్ని చిరస్థాయిగా నెలకొల్పాలన్న తాపత్రయంతోనే ఆయన కడవరకు కలం ఆడిస్తూనే పోయాడు.

ధనలక్ష్మి చంచలచిత్త అని జగత్ప్రసిద్ధి. సుమతీ శతక కారుడు—

సిరి దా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలము భంగిన్
సిరిదాఁ బోయినఁ బోవును
కరిమ్రింగిన వెలగపండు కరణిని సుమతీ

అని చెప్పనే చెప్పాడు, అయినా, చంచలచిత్తంలో ధన లక్ష్మి కీర్తికాంతకు చాలదు. కీర్తి ఎందుకు వస్తుందో, మరెందుకు పోతుందో తెలియదు; ఎప్పుడు వస్తుందో, మరెప్పుడు పోతుందో కూడా తెలియదు. నిన్న ఊరూ పేరూ లేనివాడే నేటికి ఊరూనాడూ మ్రోగిపోతుంటాడు. పోనీ, నిన్నటికీ, నేటికీ మధ్య అతడేదో పొడిచివేశాడంటే ఆపని చేసినవారందరికీ అందుమూలంగా పేరు రాదు. ఎన్నడూ అబద్ధమాడనివారు చాలామంది వుండవచ్చు. అయినా ఒక్క హరిశ్చంద్రుడికి, ఒక్క వాషింగ్టన్‌కు మాత్రమే సత్యసంధతకు ఖ్యాతి లభించింది. "నిరయంబైన, నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన, దుర్మరణంబైనఁ, గులాంతమైన, నిజమున్ రానిమ్ము..." అని బింకానికి పోయిన కొందరు చాదస్తులుగానో, వెంగళప్పలుగానో నగుబాట్లపాలుకావడం కద్దు. వెనకటికి ఒక బ్రహ్మసమాజికుడు—ఆయన పేరు హేరంబచంద్ర మైత్ర; కలకత్తా సిటీ కాలేజీ ప్రిన్సిపాల్—పల్లెటూరువారు కొందరు వీధిలో యెదురుపడి "రామలీల" ఆడుతున్న పేటకు దారి అడగగా, నృత్య నాటక గాన వినోదాలు పాపపంకిల భూయిష్ఠమైనవని నమ్మినవాడు కనుక, తనకు తెలియదు పొమ్మని కోపంతో విదిలించాడట. దారి అడిగినందుకే ఈయన ఇంత బుస్సుమన్నా డెందుకో

నని ఆశ్చర్యపడుతూ వారు పదిబారలు సాగాఁడిపోయేసరికి "దారి నాకు తెలిసివుండీ తెలియదనడం అబద్ధం చెప్పడమే కాదా?" అని ఆ సత్యశీలి మనస్సు చివుక్కుమన్నదట. గిఱ్ఱున వెనక్కుతిరిగి, అంగలు పంగలు వేసుకుంటూ వెళ్లి, "మీరడిగిన చోటుకు దారి నాకు తెలుసు. కాని, మీకు చెప్పను" అని ఫెడీమని అనివేసి, మళ్లీ తనదారిని చక్కాపోయాడట. తెల్లబోయి, "ఇతడేమి పిచ్చివాడు కాదు గదా?" అని ఆ గ్రామస్థులు ఒకరి ముఖాలొకరు చూచుకున్నారట. పిచ్చిపుల్లాయి అనిపించుకొనడంకంటె పచ్చిదొంగ అనిపించుకోవడమే ఏనాటైనా మెరుగు కనుకనే ప్రాపంచికానుభవంలో పండిన శుక్రాచార్యులవారు "వారిజాక్షులందు, వైవాహికములందుఁ, బ్రాణమానవిత్త భంగమందుఁ, జకితగోకులాగ్రజన్మ రక్షణమందు బొంకవచ్చు" అని సెలవిచ్చివుండాలి.

కీర్తి వచ్చినవారికి అది ఎందువల్ల వచ్చిందో సరిగా తెలియదు సరిగదా. ఏదో ఒక కారణాన ఎంతో కొంత అబ్బినా, అది స్థిరంగా నిలుస్తుందన్న గ్యారంటీ లేదు. ఇవ్వాళ ప్రతినోట వినవచ్చే పేరును రేపు ఒక్కరైనా తలవక పోవడం అరుదైన సంఘటన కాదు. "పాల్ అంటే యెవరండీ?" అని తెలియక అడిగితే నలభైయేళ్లక్రితం నవ్వేవారు; తెలిసే అడిగితే "బిపిన్ చంద్రపాల్ పేరు తెలియనంతటి మూర్ఖుల మనుకొన్నారా!" అని కోపగించుకునేవారు. అప్పటిలో ఆయన ప్రభ అంతగా వెలిగిపోతుండేది. ఆయ

నను కలుసుకోవడమే, ఆయనతో ఒకసారి మాట్లాడ్డమే, ఆయన పరిచయభాగ్యాన్ని పొందడమే జన్మ తరించడంగా అప్పటిలో భావించేవారు. మన ఆంధ్రదేశం పర్యటనకు వస్తే ఆయనకు మనవారు ఎంతగా బ్రహ్మరథంపట్టిందీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి "స్వీయచరిత్రము" చూస్తే తెలుస్తుంది. 1906 లో ఆయన రాజమహేంద్రవరం వచ్చి, మొదటి ఉపన్యాసాన్ని ఇన్నీసుపేటలో ఒకచోట చేసేసరికి ఆ మర్నాటి నుంచీ దానిపేరు "పాల్ చౌక్" అయిపోయిందట. "శ్రీకృష్ణుని గానము విని మోడులు చిగురించినట్లు, రాళ్లు స్రవించినట్లు బిపినుచంద్రపాలుగారి యుపన్యాసములు విని జను లుద్రేకపూరితులై"నారట. చిలకమర్తివారి స్వీయ చరిత్రలో ఈ మాట లేదుగాని, కొన్నేళ్లపాటు "లాల్—బాల్—పాల్" అని దేశం మారుమ్రోగింది. ఈ ప్రముఖ త్రయంలో లాలా లజపత్ రాయ్ ని, బాల గంగాధరతిలక్ ను జయంతి, వర్ధంతులనాడైనా ఇప్పటికీ సంస్మరిస్తున్నారు కాని, బిపిన్ చంద్రపాల్ తన జీవితకాలంలోనే ఖ్యాతిని కోల్పోయాడు. చివరి చివరికి అపఖ్యాతి పాలైనాడుకూడా. కీర్తికాంత ఈ చంచల స్వభావాన్ని దృష్టిలో పెట్టుకున్నందునే "మరణానంతరం కనీసం పాతికసంవత్సరాలైనా దొర్లివుంటేనే స్మారకచిహ్న నిర్మాణానికి సమ్మతి" అనే ఉత్తమ నియమాన్ని లండన్ కౌంటీ కౌన్సిల్ పెట్టుకున్నది.

ఏ పది, పదిహేను సంవత్సరాలో కాక, లేదా, ఏ నలభై, యాభై సంవత్సరాలో కాక పాతికేళ్లి గడువుపెట్టడం

లోతుగా ఆలోచించినమీదటనే జరిగిందని చెప్పాలి. పాతికేళ్లు తిరిగి వచ్చేసరికి అడ్డాలవారు గడ్డాలవారౌతారు. అంటే, ఒక కొత్తతరం తలయెత్తగలదన్నమాట! ఒక తరాన్ని దాటి మరొకదానికి విస్తరించిన కీర్తి అటుపిమ్మట మాసిపోవడం సర్వసాధారణంగా జరగదు. మాసినా కొన్ని కళలు తగ్గడంవరకే కాని, పూర్తిగా కాదు. కనుమరుగైన పాతికేళ్లతర్వాతకూడా లోకం మరచిపోని వ్యక్తికి స్మారక చిహ్నం కట్టడానికి ఎవరైనా ముందుకువస్తే వారిని సర్వవిధాల ప్రోత్సహించవలసిందే. “మరి కొన్నేళ్లపాటు ఆగితే ఆ వ్యక్తి కీర్తి కడకంట నిలిచేదీ, లేనిదీ నిస్సంశయంగా తెలుస్తుందికదా?” అని ఈ గడువును పొడిగించడం తెలివిగలపని కాబోదు. స్మారకచిహ్న నిర్మాణం వ్యయప్రయాసలతోకూడిన పని. దానికి ఉద్యమించగల శ్రద్ధాసక్తులు, ఎవరికై స్మారకచిహ్నం ఉద్దేశించబడుతున్నదో వారిని జీవితకాలంలో సన్నిహితంగా యెరిగినవారికి తప్ప, తక్కినవారికి సామాన్యంగా వుండవు. అసలు వ్యక్తిపోయిన తర్వాత పాతికేళ్లకుమించి ఆగితే, ఇట్టివారు మిగలడం కష్టం.

లండన్ కౌంటీ కౌన్సిల్ నియమాన్ని మన మునిసిపాలిటీలు “కాపీ” చేస్తే నేను బ్రహ్మానందపడతాను. పుల్లయ్య పురపాలక సంఘాధ్యక్షుడుగా పనిచేశాడనో, సహకారసంఘం ప్రెసిడెంట్‌గిరి వెలగబెట్టాడనో ఏవీధికో, పేటకో, పార్కుకో ఠపీమని ఆ పుల్లయ్య పేరుపెట్టడం ప్రస్తు

తం మన పట్టణాలలో జరుగుతున్నది. ఆ మహామహోపదవిని అలంకరిస్తున్నప్పుడు పుల్లయ్య పేరు దివ్వెటీలా మండిపోతూ వుండవచ్చు. మరి నాలుగేళ్లకు అతడిపేరు తలచేవారే వుండకపోవచ్చు. అయినా ఆ వీధినో, పేటనో, పార్కునో కలకాలానికీ వెక్కిరిస్తూ ఆ పేరు మాత్రం మిగిలిపోతుంది. ఇంతే కాక, మన పురమందిరాలలో ఎందరి త్రివర్ణచిత్రాలు లేవు! మన పురవీధులలో ఎందరి శిలావిగ్రహాలు లేవు! ఆ చిత్రపటాల అంచులపై వ్రాయబడివుండే పేర్లను, లేదా, ఆ శిలావిగ్రహాల వేదికలపై చెక్కబడివుండే పేర్లను చదువు కోనిదే వీరిలో చాలామంది ఫలనావారన్న సంగతి మనకు తెలియదు. అప్పటికైనా "ఇతడు పుల్లయ్య", లేదా, "అతడు యల్లయ్య" అని తప్ప మనకు తెలిసేది కాని, మనం తెలుసుకోదగింది కాని వుండదు. ఇట్టి దివ్యనామాలను చిరస్థాయిగా నిల్పడానికి ఉద్యమించేముందు లండన్ కౌంటీ కౌన్సిల్ పెట్టుకున్న పాతికేళ్ల గడువును మన్నిస్తే ఎంతగా వ్యయప్రయాసలు తప్పవు? ఎంతగా మన పురసౌందర్యం పెరగదు?

లండన్ కౌంటీ కౌన్సిల్ చేసుకున్న ఒక్క నియమమే మన దేశానికి చాలదు; దానికి మరొకదాన్ని మనం జత చేర్చుకోవాలి. ఇటీవల మన బస్తీలలోనే కాకుండా మారు మూల కుగ్రామాలలోనూ గాంధి, కస్తూరీబా, నెహ్రూ, నేతాజీ మొదలైన దేశనాయకుల సిమెంట్ విగ్రహాలను వెలిపిస్తున్నారు. వీటిలో నూటికి 99 వంతులకుపైగా భరించ

రానంతటి వికారమైనవి. ఇవి అల్లంత దూరాన కనబడగానే నేను రెండు కళ్లూ గట్టిగా మూసుకుని, క్షేమంగా అవతలికి చేరేవరకు తిరిగి తెరవను. "క్షేమంగా" అని నేనన్నప్పుడు నా క్షేమం, ఆ విగ్రహాల క్షేమంకూడా. పరీక్షగానే అక్కర లేదు, పొరపాటుగానైనా వాటిని ఆపాదమస్తకం చూస్తే కలరావస్తుందేమోనని నాభయం. వాటివికారాన్ని భరించ లేక ముక్కచెక్కలు చేసివేస్తానేమోననీ నాపట్ల నాకు అను మానమే. దిష్టిబొమ్మలకంటె కనికష్టమైన ఈ సిమెంట్ బొమ్మలను—ఏ నూరు రూపాయలకో, రెండు నూర్లకో చౌకగా వస్తున్నవిగదా అని—వేలంవెర్రిగా ప్రతిష్ఠాపన చేయడం మన నాయకులను సమ్మానించడం కాదు, వారి పట్ల మహాపచారం చేయడం; ఇది వారిపట్ల భక్తిప్రపత్తు లను చూపడం కాదు, ఖూనీ చెయ్యడం. ఎవరికైతే స్మారక చిహ్నాలు ఉద్దేశించబడతాయో అవి వారి అంతస్థుకు తగి నవై వుండాలి. పర్వతాలతో పోటీచేస్తున్న పిరమిడ్సు వినా మరొక విధమైన స్మారకచిహ్నాలు ఫారోరాజుల అధికార దర్పానికి, ఆడంబరజీవితానికి తూగగలిగేవి కావు. అతి లోక సుందరమైన తాజ్‌మహల్ తప్ప మరొకటి ముంతాజ్ పట్ల షాజహాన్ అగాధప్రేమకు చిహ్నంకాగలిగేది కాదు. మహాసామ్రాజ్యాల సంపత్తినంతటినీ వినియోగించి స్మారక చిహ్నాల నిర్మాణం కొనసాగించడం మనకు సాధ్యంకాక పోవచ్చు; సాధ్యమైనా అది వాంఛనీయం కాకపోవచ్చు. కాని, మన దేశనాయకులపట్ల భక్తిగౌరవాలను తెలుపు

కోవాలంటే విగ్రహానికి అయిదు, పదివేల చొప్పునైనా ఖర్చుపెట్టలేమా? దాన్ని చలవరాతిలో మలచడానికో, కంచులో పోతపోయడానికో ఒకపాటి శిల్పినైనా నియోగించుకోలేమా? ఇంతమాత్రం ఓపికైనా మనకు లేకపోతే, ఒక నమస్కారం పెట్టి మిన్నకుండక, ఏదో పాడు అచ్చు నుంచి గుద్దిపారవేసిన సిమెంట్ దిష్టిబొమ్మలతో మనకు పూజనీయులైనవారిని వెక్కిరించడం భావ్యమా? నాకు అధికారమే వుంటే ఈ దిష్టిపిడతల ప్రతిష్ఠాపనకై యేర్పాట్లు చేస్తున్నవారికి అయిదేళ్లు కఠినవరకం, వీటిని ఆవిష్కరిస్తున్న వారికి యావజ్జీవశిక్ష విధిస్తాను.





# నానాత్వంలో ఏకత్వం

కొన్నేళ్లుగా నేను బహు చెదురుగా తప్ప కాఫీ హోటల్‌కు పోవడంలేదు. అయినా, మొన్న మౌంట్‌రోడ్డులోని ఒక హోటల్‌లోకి పాదం పెట్టగానే "రాండి సార్" అంటూ అక్కడి "సర్వర్" కుర్రవాడొకడు చిరునవ్వుతో సత్కరించాడు. అంతటనైనా ఆగక, ఖాళీగావున్న ఒక టేబుల్ వద్దకు దారిచేసి, దాన్ని క్లీన్ చేయించి, కుర్చీ సర్ది, "ఉక్కారుంగో" అంటూ వెళ్లి, ఫ్యాన్‌తో అంతగా అవసరం కనబడకపోయినా దాన్ని జోరుగా వదిలాడు. నేను జిలేబీ తెచ్చిపెట్టమనగా అది తాజాసరుకు కాదని రసగుల్లా తెచ్చియిచ్చాడు; వడ కెమ్మంటే బజ్జీలు వేడివేడిగా వున్నవని వాటిని తెచ్చిపెట్టాడు. కాఫీని కమ్మగా కలుపుకు

వచ్చి, నురుగులు కట్టేటట్టు ఆరబోసి, భక్తి శ్రద్ధలతో ముందుపెట్టాడు. ఈలోపున ఆ టేబుల్ వద్దకు మరొక రిద్దరు వచ్చినా వారి సంగతి అంతగా పట్టించుకోనే లేదు. ప్రత్యేకించి నాకు అత డింత మర్యాద మన్ననలను ఎందుకు చేస్తున్నాడని కొంత ఆశ్చర్యం కలగకపోలేదు. పరిపరివిధాల ఆలోచించినా అతడి ప్రవర్తనకు కారణం నాకు పాలుపోలేదు. చివరికి అనుకున్నమాట: మనకు తెలియనివాడైనా, మన ఘనత కర్ణాకర్ణిగా వినివుండవచ్చునని. ఇంతలో అతడు చిరునగవులతో విందుచేస్తూ బిల్లు తెచ్చాడు. అతడిదృష్టిలో మనం ఘనతవహించిన వ్యక్తులమైనందుకు ఘనతగా దాన్ని అందుకుని, ఘనతగా లేచి, ఘనతగా సాగారబోయేసరికి "రెండు పేరుక్కు ఒరు ఫ్రీ ప్యాస్ కుడుంగో సార్!" అన్నాడు. తెల్లబోయి "ఏమి ఫ్రీ ఫ్యాస్" అని ప్రశ్నించగా "నంబ ధియేటర్‌కుదా సార్!—చంద్రలేఖ పడం నడకర దామ్, సార్" అని యికిలించాడు. చప్పున అర్థమైంది అతడు నన్ను చూచి మరొకరుగా పొరపడ్డాడని, ఆ పొరపాటువల్లనే మరొకరు అందుకోవలసిన "ఫ్రీప్యాస్" మర్యాద మన్ననలు నాకు దక్కినవని. నిజం చెప్పవద్దూ—రెండంగుళాలు పొడవు తగ్గి, ఆ కాఫీ హోటల్‌నుంచి బయట పడ్డాను.

ఏ కొద్దిపాటి పోలికవున్నా ఒకరిని చూచి మరొకరుగా పొరపడ్డం తరచు జరుగుతూనే వుంటుంది. మరీ అప్తులైన

వారి విషయంలోనే—నిరంతరం మనసముక్షంలో మసలే విషయంలోనే—వారి ముఖకవళికలను మనం అంత పరీక్షగా గుర్తించము. ఒకవేళ గుర్తించినా క్షుణ్ణంగా జ్ఞాపకంవుంచుకోవడం జరగదు. ఇక, కేవలం పరిచితవ్యక్తులరూపం లీలామాత్రంగానే మన మనోవీథిని వుంటుంది. ఎదటపడినప్పుడు వారిని పోల్చుకోడానికి ఇది తోడ్పడుతుంది. పరోక్షంలో వుండగా వారి రూపురేఖలను తు. చ. తప్పకుండా వర్ణించమంటే అది మనకు సాధ్యం కాదు. కోర్టులో సాక్ష్యం చెప్పే సందర్భంలో ఈ సంగతి బయటపడుతుంది. చిన్నతనంనుంచీ బాగా ఎరుగున్నవారినిగురించైనా వారి ముఖంతీరు, వారి ముక్కుతీరు, వారి చూపు, వారి ఛాయ, వారి వొడ్డు, వారి పొడుగు మొదలైన వివరాలపై ఎదటిపక్షం ప్లీడర్ క్రాస్‌పరీక్షకు దిగేసరికి తడబడనివారు సామాన్యంగా వుండరు.

ఈ మధ్యనే నాకు మరొక చిత్రమైన అనుభవం కలిగింది. అయిదారు సంవత్సరాలతర్వాత నేను మా స్వగ్రామానికి, మేనమామగారి యింటికి వెళ్ళాను. "మా స్వగ్రామానికి, మా మేనమామగారి యింటికి" అనడాన్నిబట్టి మాది, మా మేనమామలదీ ఒకే గ్రామమని స్పష్టం. మేనమామ, విశేషించి ఒకే గ్రామం, కావడంవల్ల నేను ఆయనను నా చిన్నతనంనుంచీ బాగా ఎరుగున్నా ననడమూ స్పష్టం. అయినా, క్షౌర్యున్న "ఈయన మా మేనమామేనా!" అని

నాకు కొన్ని క్షణాలపాటు సందేహం తోచిందంటే నమ్మ గలరా? మీరు నమ్మినా, నమ్మకపోయినా ఇదిమాత్రం నిజం. నే నేదో పుస్తకం చదువుతూ కూర్చుండగా మా మేనమామ తమ పొరుగింటి పెద్దమనిషితో సంభాషణ ప్రారంభించాడు. కొంత సేపైనతర్వాత మరి నా మనస్సును పుస్తకంమీద లగ్నంచెయ్యడం కష్టమైంది. అంతట చేతిలోని పుస్తకం చాటుచేసుకుని ఆయనవంక రెప్పవెయ్యకుండా చూశాడు, నాలుగు నిమిషాలు తేరిపారజూచేసరికి అదేమోగాని "ఈయన మా మేనమామేనా?" అనే చిత్రమైన సందేహం కలగ సాగింది. నేను చిన్నతనంనుంచి ఎరిగివున్న వ్యక్తి వేరు, ఈ వ్యక్తి వేరు అనిపించింది. నామనస్సులో వున్న రూపానికీ, దీనికీ ఇంత భేదం వున్నదేమా అని ఆశ్చర్యం కలిగింది. నా వెర్రిభావాలకు నాకే చిరునవ్వు వచ్చి, వెంటనే దృష్టిని వేరొకవైపుకు మరల్చి, క్షణంతర్వాత స్థూలంగా చూస్తే, నాకు దగ్గరగా కూర్చుని, పొరుగింటి ఆసామితో ముచ్చటిస్తున్నది మా మేనమామే! నాకు కలిగిన ఈ అనుభవంలో వాస్తవానికి అంత పెద్ద వైచిత్ర్య మేమీ లేదు. నిలువుటద్దంముందు నిలబడి మన బింబాన్ని మనమే దీర్ఘంగా, పరిశీలనగా, నిశితంగా చూచుకుంటే మనం మనమేనా అనే వెర్రిసందేహం కలగడం కద్దు! మన ఆకారం మనం పోల్చుకోవడంకంటె మనగొంతు మనం గుర్తించడం మరింత కష్టం. రేడియో ప్రసంగాన్ని రికార్డు చేసినవారికి ఇది అనుభవవేద్యం.

కవల బిడ్డలుగా పుట్టినా కేవలం అచ్చంగా ఒక మనిషి వలె ఇంకొకరు వుండరనే నా భావం. మీకూ, నాకూ వారు ఒకే అచ్చున పోయబడినవారివలె కనబడవచ్చు. కాని, వారి తల్లికికూడా వారిమధ్య తారతమ్యం కనబడకుండా వుంటుందా? కనబడనిపక్షంలో ఆమె వారిని విడివిడిగా ఎలా పోల్చుకోగలదు? చేతికి పట్టుదారం కట్టిగాని, వేలికి ఉంగరాన్ని పెట్టిగాని, ఒక బిడ్డనుంచి మరొకబిడ్డను విడిగా గుర్తుపెట్టుకోడానికి కవలబిడ్డలతల్లి కొత్తలో యత్నించవచ్చు. కాని, కొద్దిరోజులలోనే ఇట్టి కొండగుర్తుల అవసరం తీరుతుంది. ఆ తర్వాత ఆమె ప్రేమనేత్రం, ఆమె మాతృహృదయం మన కంటికి అచ్చమైన ఆ పోలికల మధ్య ఏదో సూక్ష్మభేదాన్ని కనిపెట్టనే పెడుతుంది.

రూపంలోనే కాదు; ఇతరవిధాలకూడా మనిషికీ, మనిషికీ మధ్య పోలికవుండదు. మాటలలో, చేతలలో మనిషికీ, మనిషికీమధ్య ఎంతో వ్యత్యాసం. ఇక స్వభావంలో వైరుధ్యాలకు అంతే లేదు. మనం దాన్నిగురించి అంతగా ఆలోచించముగాని, ఒకరి వేలి ముద్రవలె మరొకరిది వుండకపోవడం ఎంత చిత్రం! ప్రపంచం జనాభా ఇంచుమించు 250 కోట్లు. 250 కోట్లమంది 2,500 కోట్ల చేతివేలిముద్రలు 2,500 కోట్ల రకాలుగా వుంటాయి. మీ వేలిముద్రను మీరు ఎన్నడైనా పరిశీలించుకున్నారా? ఈ వ్యాసాన్ని వ్రాస్తూవుండగా నా వేలిముద్ర ఎలా వుంటుందో నే

న్నడూ గమనించలేదని స్ఫురించింది. వెంటనే కుడిచేతి బొటనవేలికి ఇంత సిరా పూసి, ఒక కాగితంమీద ముద్ర వేశాను. దాన్ని పరిశీలించగా సన్నగా, సున్నితంగా, నెలవంకవంపులతో వున్న ఆ గీతలు, వాటిమధ్య ఒక శంఖం: అందం వుట్టిపడుతూ కనబడింది. ఇంతటి చక్కని రేఖాచిత్రాన్ని గియ్యడం ఏ చిత్రకారుని తరమూ కాదు. అయితే, వేలిముద్రలు వెయ్యడం అవిద్యకు చిహ్నమైంది. నేరస్థుల వేలిముద్రలు తీసుకుంటారు. ఈ రెండు కారణాల వల్లనే మన వేళ్ళపై వుండే సూక్ష్మమైన రేఖల అందాన్ని మన మెన్నడు గమనించడం జరగదనుకుంటాను.

మనిషికీ, మనిషికీ వేలిముద్రలలోగల భేదాన్ని కొందరు ప్రవీణులుమాత్రమే కనిపెట్టగలరు. వేలిముద్రలలోని భేదాలను వారొక శాస్త్రంవలె అభ్యసిస్తారు. దుర్భిణిసహాయంతో వాటి సన్నని గీతలమధ్యగల స్వల్ప వ్యత్యాసాలను పరిశీలనగా చూస్తారు. కాని, ప్రత్యేక ప్రవీణులు సయితం కనిపెట్టలేని విధంగా మానవునికీ, మానవునికీమధ్య మరొక విభేదంకూడా వున్నది. వాసనకు సంబంధించింది ఈ విభేదం. ఒక్కొక్క వ్యక్తిని అనుసరించి ఒక్కొక్కవిధమైన గంధం వుంటుంది. స్నానం చెయ్యక అపరిశుభ్రంగా వుండేవారి ననుసరించి దుర్గంధం వుంటుంది; చక్కగా స్నానం చేసి, పరిశుభ్రంగా వుండి, అత్తరునో, పన్నీరునో పూసుకున్నవారి ననుసరించి సుగంధం వుంటుంది. అధునాతన యువతి పక్కగా నడిస్తే

పౌడర్-క్రీం-రూజ్-లిప్‌స్టిక్-లవండర్ సమ్మిళితమైన ఒక చిత్ర సుగంధం మన నాసికాపుటాలకోటలో పాగా వేస్తుంది. కాని, నే నిక్కడ ప్రస్తావిస్తున్నది ఈవిధమైన గంధాలను గురించి కాదు. మన నాసికాపుటాలకు అందని ఒక అతి సున్నితమైన గంధం ఒక్కొక్క వ్యక్తిని అనుసరించి ఒక్కొక్క విధంగా వుంటుంది. కుక్క పసిపట్టడానికి కారణం దాని నాసికాపుటాలకు ఈ అతిసున్నితపు గంధాన్ని తెలుసుకోగలశక్తి వుండడమే! మానవునికికూడా అతడి ఘ్రాణేంద్రియం సున్నితగుణం సభ్యతాఫలితంగా పోకముందు ఈ పసిపట్ట గల శక్తి వున్నట్టు తోస్తుంది. నరుడు దరిదాపులలో ఎక్కడైనా సరే వుంటే, అతడిని పొడగట్టకపోయినా పసికట్టి, రాక్షసులు నోరూరుతూ "నరవాసన వస్తున్నది-నరవాసన" అనేవారని మన పురాణాలు చెబుతున్నవి. రాక్షసులంటే నరమాంస భక్షకులైన అసభ్యమానవులే కాని, మానవేతర జాతివారు కారు. నరుని సామీప్యాన్ని వారు పసిపట్టగలిగేవా రంటే, ఈనాడు శునకాల నాసికాపుటాలకున్న శక్తి ఒకనాడు మానవునికికూడా వుండేదనే తీర్మానించుకోవాలి. ఇప్పటికీ మన జిహ్వేంద్రియంకంటె ఘ్రాణేంద్రియమే మహాసున్నితమైంది. ఆవగింజ అరవయ్యోవంతులో అరవయ్యోవంతు అత్తరువాసనైనా మన ముక్కు పట్టివేయగలదుగాని, ఒక ఆవగింజకు గింజనే నోట్లో వేసుకున్నా దాని రుచి తెలియదు. చిన్ననాడు

మనం చెలిమిచేసినవారిని, పాతరోజులలో మనం తిరిగిన ప్రదేశాలను ముఖ్య జ్ఞాపకానికి తెచ్చినంతగా మిగిలిన జ్ఞానేంద్రియాలు తేవని ఆలివర్ వెండల్ హోమ్స్ వ్రాశాడు. ఆయన వ్రాసినదాని రుజువుకు నా అనుభవమే సాక్షి. ఈ నాడైనా ట్రిప్లికేన్ బీచ్‌కి పైక్రాఫ్ట్సరోడ్డువెంట వెడుతుంటే బక్కింగ్‌హాం కెనాల్ బ్రిడ్జిని సమీపించేసరికి ముక్కుపైకి ఎంత అప్రయత్నంగా చెయ్యివెడుతుందో అంత అప్రయత్నంగానే మద్రాసుచేరిన కొత్తలో నిరుద్యోగిగా బెల్సరోడ్డులో ఒక చిన్నగదిలో నేను కాలక్షేపంచేయడం, మిడసరిలగ్నంలో అనేకసార్లు ఆ దారినే నెత్తి కాళ్లూ కాలుతూ యూనివర్సిటీ లైబ్రరీకి వెళ్లడం, దాదాపు ప్రతి సాయంత్రం ఆ దారినే బీచ్‌కి చేరి, వేలాదిప్రజల మధ్య కూడా బరువైన ఏకాంటరితనంతో గంటలకొద్దీ వెర్రివాని వలె తిరగడం, ఒక్కొక్కసారి ఊరు మాటుమణగిన తర్వాతకూడా ఆ దారినే వెళ్లి, లోపలి కలతకు, బ్రతుకు వెలితికి విరుగుడేదైనా దొరుకుతుందేమోనని సముద్రపు ఘోషకు చెవులు రిక్కించడం, ఒకనాటిరాత్రి భోరున గాలి వీస్తూ, జోరునవర్షం కురుస్తుండగా తుఫానుపట్టిన సంద్రాన్ని చూడాలన్న బుద్ధిపుట్టగా తక్షణం బయల్దేరి ఆ దారినే వెళ్లి, కొండలవలె లేస్తూ, విరుగుతూవున్న కెరటాల నురుగులు కన్ను పొడుచుకున్నా కనబడని ఆ చిమ్మచీకటిని సయితం చీల్చుకుని దెయ్యపునవ్వును తలపింపజేస్తుండగా నిలవనూ

లేక, కదలిరానూ లేక, పక్కా అరగంట వానకు తడుస్తూ, గాలికి తూలుతూ, చలికి గజగజలాడిపోతూ గుడ్లు అప్ప గించడం—ఇట్టి స్మృతులెన్నో ఒక్కసారిగా నిద్రలేచి నేను ముందంటే నేను ముందని జుట్టుపట్లు పట్టుకుంటాయి. ఇదే విధంగా ఏయే సుగంధదుర్గంధాలు నాకు ఏయే విష యాలను జ్ఞాపకంచేస్తుంటవో చెప్పాలంటే ఈ చిన్న వ్యాసం పెద్ద స్వీయచరిత్రగా మారిపోవచ్చు.

ఎంత మంచి గడియారమైనా, ఎంత ఖరీదుగలదైనా కొందరివద్ద తిన్నగా పనిచెయ్యదు; ఎంత చౌకబారు గడి యారమైనా కొందరివద్ద నిమిషమైనా వారలేకుండా చక్కగా తిరుగుతుంది. దీనికి కారణం? ఆయావ్యక్తుల నను సరించివుండే గంధమేనని ఒక స్విస్ ప్రముఖుడు అంటు న్నాడు. కొందరి శరీరాలనుంచి వెలువడే గంధం కారణంగా వారి చేతిగడియారంలోని ఆయిల్ మడ్డితేరుతుందట. ఈ మడ్డి చక్రాలను అడ్డి, గడియారాన్ని పనిచెయ్యనివ్వదట. ఈ వివరణ చిత్రంగా వున్నా అసంబద్ధమని దీన్ని తోసివెయ్య గలమా? స్విస్ దేశస్థుడు గనుక, తమ గడియారాలలో లోపం లేదనడానికీ, వాటిని వాడేవారిపైనే నెపం నెట్టడానికీ ప్రయత్నిస్తున్నాడనగలమా?

మొత్తంమీద మానవునికీ, మానవునికీమధ్య ఏవిధమైన పోలికా లేదు. అలాగని మానవులు విభిన్నజీవులని భావిం చడం పొరపాటు. చూపులలో, చేతలలో, మాటలలో,

పోకడలలో ఆలోచనలలో, అభిరుచులలో, గుణగణాలలో, శక్తియుక్తులలో, చివరికి వాసనలలోకూడా, మానవుల మధ్య విభేదాలు వున్నప్పటికీ, వాటినిమించిన ఒక ఐక్యత వారిలో వున్నది. దేశ, జాతి, మత, వర్ణ విభేదాలకుసయితం అతీతమైనట్టిది ఈ ఐక్యత. మానవులందరు ఒకేవిధంగా జన్మిస్తారు; ఒకేవిధంగా మరణిస్తారు; కష్టసుఖాలకు ఒకే విధంగా చలిస్తారు. సమానానుభూతికి అందరిదీ ఒక్కటే నవ్వు, ఒక్కటే నిట్టూర్పు. ఏ గుండెలో వెలిగినా ఒక్కటే ఆశ, ఏ చెక్కిలినుంచి జారినా ఒక్కటే కన్నీరు. ఇంతకంటె బలీయమైన ఐక్యత — దీన్నిమించిన ఏకత్వం — వుండగలవా?





# కవుల ఢంకా

"నన్ను నేనే పొగడుకోగలిగినప్పుడు ఆ పని నేను మరొకరికి ఎందుకు అప్పగించాలి" అని బెర్నార్డ్ షా తెగవేసి అడిగాడు. మనసారా తన పొగడ్తను తానే చేసుకున్నాడు. షావలె చచ్చులేకుండా చెప్పి మరీ చెయ్యకపోయినా, ప్రతి పెద్ద కవి తన డబ్బాను తాను ఎంతో కొంత వాయించుకున్నవాడే. మన నన్నయ్యగారినే చూడండి. "అవిరళ జప హోమ తత్పరు"డను, "విపుల శబ్దశాసను"డను, "సంహితాభ్యాసు"డను, "బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతు" డను, "పాత్రు" డను, "సద్వినుతావదాత చరితు" డను, "లోకజ్ఞు"డను, "ఉభయభాషా కావ్యరచనాభిశోభితు"డను, "సత్ప్రతిభాభియోగ్యు"డను, "నిత్య సత్య వచను"డను అని తనకు తానై ఎన్ని కితాబు లిచ్చుకున్నాడో! ఇక, శ్రీనాథుడు "దీనార టంకాలఁ దీర్థమాడిం

చిత్తి దక్షిణాధీశు ముత్యాలశాల” అని, “పగులగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క” అని, “చంద్రభూపక్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమ బిరుద” మని తన ఢంకా తానే బజాయించాడు. అదేమి ఇదేమని తనను దగ్గరికి తీసిన కృష్ణదేవరాయలనే “పెద్దనబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే” అని పెద్దనామాత్యుడు రొమ్ము విరుచుకుంటూ రెట్టించాడు.

పోతే, పిల్ల కవుల సంగతి చెప్పనక్కరనే లేదు. పెద్ద కవులు తమ గొప్పనుగురించి బాకాను ఒక్కదాన్నే పట్టుకోగా, పిల్ల కవులు బాజాభజంత్రీ లన్నింటినీ ఉపయోగించి వేసుకుంటారు. పెద్ద కవులకంటె ఎక్కువగా పిల్లకవులే తమ పొగడ్తను తామే చేసుకోవడం అకారణంగా జరగదు. నిజంగా మహాకవులైనవారు—కీట్సువలె చెదురుగా కాన వచ్చే ఏ కొద్దిమందినో మినహాయిస్తే—తమ జీవితకాలం లోనే సన్నుతి నందుతారు. అందువల్ల తమ ఘనతను తామే చాటుకోవలసిన ఖర్మ వారికి పట్టదు. ఒకవేళ పట్టినా, ఆదిలో కొద్దికాలంపాటే. ఆ తర్వాతకూడా వారు స్వోత్కర్ష చేసుకుంటే అది స్వాతిశయంవల్ల కాదు; తన బలదర్పాలను తా నెరిగిన మృగరాజు అప్పుడప్పుడు జూలును జళిపించడం, పంజాను నేలను రాయడం, దిక్కులు పిక్కటిల్లేటట్టు గర్జించడం ఎంత సహజమో, ఈ స్వోత్కర్ష

కూడా అంత సహజం. కవిసింహాలు కానివారు ఈ పని చేసి నప్పుడే ఇది హాస్యాస్పదంగా పరిణమిస్తుంది. ఈ మాట మనం చెప్పినా వారి తల కెక్కదు. మహాకవి కోవకు చెందనివారికి లోకంనుంచి నిర్లక్ష్య, నిరాదరణలు తప్పవు; ధిక్కార తిరస్కారాలు తప్పవు. వీటినిచూచి లోకం గ్రుడ్డిది కనుకనే తమ ప్రతిభను అది గుర్తించలేక పోతున్నదని వారు నిశ్చయించుకుంటారు. సాటికవుల ఈర్ష్యావిద్వేషాలవల్లే తమ పేరు బయటికిరావడంలేదని ధ్రువపరచుకుంటారు. అక్కడినుంచి తా మింతవారమని, అంతవారమని లోకం చెవులు చిల్లులు పడేటట్లు పెడ బొబ్బలు ప్రారంభిస్తారు. అవి పనిచేయడంలేదన్న బాధ హెచ్చినకొద్దీ మరింతగా గొంతు చించుకుంటారు.

మహాకవులైనవారు స్వోత్కర్ష చేసుకున్నా, దానిలో కానవచ్చేది వ్యర్థాడంబరం కాదు; విశేష ఆత్మవిశ్వాసం మాత్రమే. హోరేస్ (లాటిన్ భాషలో మహాకవి) తన బృహత్కావ్యసౌధాన్ని గురించి ప్రస్తావిస్తూ "లోహాలకంటె ఇది గట్టిది; రాజాధిరాజుల సమాధులకంటె మహోన్నత మైంది; కుంభవర్షాలైనా దీన్ని కరిగించలేవు; తుపాను లైనా దీన్ని తుడిచిపెట్టలేవు; కాలప్రవాహానికే ఇది చెక్కు చెదరబోవడంలేదు" అని చెప్పుకున్నాడు. షేక్స్పియర్ లోనూ ఇంత ప్రబలమైన ఆత్మవిశ్వాసం కానవస్తుంది. ఆయన తన "సానెట్స్"లో "ఏ చంద్రకాంత శిలాఫలకం

కాని, ఏ భూపాలుని స్మారకభవనం కాని, ఈ కవితకంటె ఎక్కువ కాలం నిలవబోదు" అని ఎలుగెత్తి చాటుకోగలిగాడు. మరొక ఆంగ్లేయకవి వర్డ్స్‌వర్త్, తన అమరత్వం విషయమై ప్రదర్శించిన విశ్వాసం దీనికి తీసిపోయేది కాదు. తన తక్కిన కావ్యాలు ఒకవేళ కాలగర్భంలో కలిసిపోయినా, "ఈ గూటిలో ఒక పిచ్చుక గూడు కట్టుకున్నది; దీన్ని గురించి నేనొక పద్యం అల్లాను; ఇది కలకాలానికీ నిలుస్తుంది" అని ఆయన చెప్పుకున్నాడు.

తమ జీవితకాలంలో మన్నన పొందలేకపోయిన మహాకవులైనా తమ చిరంజీవిత్వాన్ని గురించి నిస్పృహ చెందినట్టు కనబడదు. "నా పేరు నీటిపై వ్రాతకాబోతున్నది" అని వాపోయిన కీట్స్ కూడా మరొక ఘడియలో "తక్కిన ఇంగ్లీషు కవుల పేర్లతో నా పేరు కూడా జతకావచ్చు" అన్న ఆశకే పోయాడు. తక్కిన ఇంగ్లీషు కవుల పేర్లతో తన పేరు జతకూడడం ఖర్మమేమి?—సాక్షాత్తు ఆ షేక్స్పియర్ సరసనే ఆయనకు లోకం ఈనాడు పెద్ద పీట వేస్తున్నది.

అసలు తన పేరే భూమిపై నిలవదేమోనని జాన్ కీట్స్ కొన్ని క్షణాలలో సందేహపడగా, తాను అనుభవించవలసినంతటి ఖ్యాతిని అనుభవించడంలేదని రాబర్ట్ బర్న్స్, కొంత బాధ పడినట్టున్నాడు. అందువల్లనే కావచ్చును ఆయన తన భార్యకు ఉత్తరం వ్రాస్తూ, "నేను మరణించిన

తర్వాత నూరేళ్లకు లోకం నన్ను ఈనాటికంటె చాలా ఎక్కువ గౌరవిస్తుంది'' అనడం తటస్థించింది. అయితే మహాకవి కనుక "నేను మరణించిన తర్వాత నూరేళ్లకు" అని బర్న్స్ చెప్పుకున్నమాట అక్షరాలా చెల్లుబాటు అవుతున్నది. తన శక్తికిమించిన ఖ్యాతికి అంగలార్చే ప్రతి కవి సాధారణంగా ఈ పలుకునే చిలకపలుకువలె పలుకుతుంటాడు.

మహాకవులైనవారు స్వశక్తిజ్ఞాన ప్రేరితులై స్వయంగా ప్రకటించుకునే ఆధిక్యం కొంత గుంభనగా వుండడంకూడా కద్దు. మాళవికాగ్నిమిత్ర నాందీ ప్రస్తావనలో "ప్రాచీనమైనది ప్రతిదీ ప్రశస్తమైంది కానక్కరలేదు; అధునాతనమైంది ప్రతిదీ నింద్యమైంది కానవసరంలేదు. పాతదైనా, కొత్తదైనా సారం గలదాన్ని ప్రాజ్ఞులు మెచ్చుకుంటారు. మూఢులే ఏది మెచ్చదగిందని ఇతరులు చెబితే దాన్ని మెచ్చుకునేవారు'' అని కాళిదాసు సూత్రధారునిచే అనిపించాడు. "భాస, సౌమిల్ల, కవి పుత్రాదులను పోలిన మహాకవుల నాటకా లుండగా, ఈ కాళిదాసు యెవడయ్యా?'' అని ముందు ప్రశ్న వేయించి, దానికి కాళిదాసు చెప్పించిన ఈ జవాబులో తన పూర్వీకులు ఎంత మహాకవులైనా, తాను అంతకంటె తక్కువవాడను కానన్న భావం ఎంత గుంభనగా లేదు!

*　　　*　　　*

క్రీర్తి వచ్చేది కేవలం కవితవల్లనే కాదు. రాజ్యపాలన, సైనిక విజయాలు, శాస్త్ర పరిశోధనలు—ఇట్టివన్నీ కీర్తికి మార్గాలే. అయితే, కవిత కూర్చే కీర్తి నిలిచినంతగా తక్కినవి నిలవవనే చెప్పాలి.

జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్

అని భర్తృహరి చెప్పినట్టు సుకవీంద్రులు సుకృతాత్ములే, రససిద్ధులే, విజయనిధులే; వారి కీర్తిశరీరాలు జరామరణ జన్మభయ రహితాలే. పైగా, కవితారంగంలో సాధించ బడిన కీర్తికి వుండే బహుళవ్యాప్తి అన్యరంగాలలో సంపా దించబడినదాని కుండదు. వాల్మీకి, వేదవ్యాసుడు తమ రంగంలో ఎంతటి అఖండులో, చరకుడు, భాస్కరాచార్యులు తమతమ రంగాలలో అంతటి ఉద్దండులు. అయినా, ఆ కవు లిద్దరి పేర్లతో మన భారతీయులకున్న పరిచయంలో నూరోవంతైనా ఈ ఆయుర్వేదాచార్యుని పేరుతోగాని, ఈ గణితశాస్త్రజ్ఞుని పేరుతోగాని కలదనగలమా? ఆంధ్రు లైన మనకు శ్రీనాథుని గురించి తెలిసినంత బాగా ఆయన కాలపు ఇతర ప్రసిద్ధ పురుషులు తెలుసునా? ఆ కవిసార్వ భౌముడు పేర్కొనబట్టిగాని, లేకపోతే వీరారెడ్డి, విస్సన్న మంత్రి, భాస్కరుడు మొదలైనవారి పేర్లు మనదాకా వచ్చేవి కావు. అంతంతమాత్రపువారైన తక్కినవారి మాట దేనికి? అయోధ్యారాముని చరిత్ర ఆదికవి వాల్మీకికి కావ్య

వస్తువై వుండకపోతే, తక్కిన ఇక్ష్వాకురాజులతోపాటు ఆయన మరొక రాజుగానే మిగిలేవాడే తప్ప, ఇంటింట, వాడవాడ పూజాపురస్కారాలు పొందగలిగేవాడు కాడు.

కవి వాక్కు నిలిచినంతకాలం తన కీర్తి నిలవదని ప్రతి రాజుకు చక్కగా తెలుసు. అందువల్లనే విజయస్తంభాలను యెత్తించడంతోను, శిలాశాసనాలను చెక్కించడంతోను, గుళ్లు గోపురాలను కట్టించడంతోను, విగ్రహాలను ప్రతిష్ఠాపించడంతోను, నగరాలను నిర్మించడంతోను సంతృప్తి చెందక కవులను దగ్గరికి తీస్తాడు; వారి కృతులను అందుకుంటాడు. ఇట్టి జాగ్రత్తపడబట్టే భోజుని, రాజరాజనరేంద్రుని, మనుమసిద్ధిని, కృష్ణదేవరాయలను మన మిప్పటికీ తలుచుకోవడం; లేకపోతే, వా రెవరో, మన మెవరమో! "భోజునివంటి రాజు కలిగితే కాళిదాసువంటి కవి అప్పుడే వుంటాడు అనడం తప్పు. కాళిదాసుకలిగితేనే భోజుడు వుండడం.

కవికృపను సంపాదించగలిగితే సామ్రాజ్యాధిపులే కాక, సామాన్యులైనా అమరత్వం పొందగలరు. ప్రపంచ చరిత్రలో ఇందుకు తార్కాణాలు వందలూ, వేలూ. వీటి అన్నింటిలో పైధియాస్‌కు సంబంధించిన గాథ మహా చక్కనిది. ప్రాచీనకాలంలో ఇతడు ఈజినాకు (గ్రీస్) చెందినవాడు. ఇస్థమియన్ ఆటలపోటీలలో జగజ్జెట్టిగా ఎన్నికై, తనను కీర్తిస్తూ ఒక పద్యం వ్రాయడానికి ఎంత చెల్లించ

వలసివుంటుందని అడగడానికి తమవ్రూరు కవి పిండార్ వద్దకు వెళ్లాడు. తనకట్నం ఇప్పటి మన డబ్బు లెక్క ప్రకారం ఇంచు మించు మూడు వేల రూపాయలని పిండార్ చెప్పాడు. "అబ్బో అంతే! అంత పెడితే నా కంచు విగ్రహాన్నే పోత పోయించు కోవచ్చు" అని పైథియాస్ పెదవి విరిచాడు. "నిజమే కావచ్చు" అని పిండార్ మందహాసంచేసి మిన్నకున్నాడు. వచ్చినదారినే ఇంటికి వెళ్ళి బాగా ఆలోచించుకున్నమీదట అడిగిన మొత్తం చెల్లించి ఒక పద్యం వ్రాయించుకోవడమే మంచిదేమోనని పైథియాస్‌కు తోచింది. ఈనాడు ఈజీనాలో కంచువిగ్రహాలు లేవు సరిగదా, ఈజినాయే లేదు. కాని, పైథియాస్ భుజబలాన్ని భూషిస్తూ పిండార్ వ్రాసిన పద్యం మాత్రం చెక్కుచెదరకుండా మిగిలివున్నది.

అయితే, పైథియాస్‌వలె ఏ మూడు, నాలుగు వేలో ఖర్చుపోయి ఆచంద్రతారార్క విఖ్యాతి నందగోరితే, అది వ్యర్థప్రయాసే కావచ్చు. అమరకీర్తి రాగలదంటే మూడు, నాలుగు వేలు ఖర్చుపోవడం పెద్ద లెక్కలో పని కాక పోవచ్చు. కాని, పిండార్ వంటి కవి తటస్థపడాలిగదా? పద్యాలలో పొగడ్తలు మాత్రమే కావాలంటే కవులతో పనే లేదు; అయిదో, పదో చేతిలో పెడితే భట్రాజులు ఎన్ని పద్యాలైనా గుప్పిస్తారు. మరికొంచెం పెట్టుబడి పెడితే, పంచరత్నాలు, అష్టకాలు, నవరత్నాలు, నక్షత్రమాలలు సమర్పించే బాలకవులు, ప్రౌఢకవులు, సరసకవులు, సహజ

కవులు, మధురకవులు, బంధకవులు, వికటకవులు, ఆశు కవులు, జంటకవులు, అష్టావధానులు, శతావధానులు, కవి హంసలు, కవికోకిలలు, కవిసింహాలు, కవిశార్దూలాలు, కవి మత్తేభాలు, కవిరాజులు, కవిసార్వభౌములు కొల్లకొల్లలుగా వున్నారు. మరి కాస్త చెయ్యిజారితే కృతిసమర్పణే చేయించుకోవచ్చు. అయితే, వీటిద్వారా వచ్చే కీర్తి సబ్బు బుడగవలె ఈక్షణం అలరించి, మరుక్షణం "టుప్పు"మనేదే!

కవితద్వారా కలిగే కీర్తి ఎంత గట్టిదో రాజకీయాల ద్వారా వచ్చేది అంత పోటిది. రాజకీయపదవిలో వుండగా ఎక్కడికి వెళ్ళినా స్వాగతాలే, సన్మానాలే, పూలమాలలే, విందుభోజనాలే, దర్శనానికి గుంపులకు గుంపులే పడి కాపులు కాస్తారు; అది లభిస్తే ధన్యులమైనట్టు సంబరపడ తారు. "మాయింటిలో బస" అంటే, "మాయింట" అని పోటీపడతారు; ఎవరింటికి వెళ్లితే వారు తమగృహం పావన మైనట్టు సంతోషిస్తారు. ఆ పదవిలో వుండగా కదిలితే పత్రి కలలో వార్త, మెదిలితే మరొక వార్త. బుర్రున చీదితే వార్త; ఖంగున దగ్గితే వార్త. అయినా, పదవినుంచి దిగగానే మళ్లీ తలచుకునేవారే వుండరు. అప్పుడు వారి బ్రతుకు "ఏమి పోలిశెట్టీ" అంటే "ఎప్పటి మొత్తుకోళ్లే" అన్నట్టు తిరిగి తయారౌతుంది. బహు కొద్దిమంది విష యంలో పదవిపోయినతర్వాతకూడా వారిపేరు తలచు కొనడం జరిగితే, అది ఒక తరంపాటు, తప్పితే రెండు తరాల

పాటు. ఫాక్స్, పిట్, వాల్‌పోల్, గ్లాడ్‌స్టన్—వీరు నలుగురు తమ జీవితకాలంలో బ్రిటిష్ రాజకీయరంగాన అద్వితీయ రాజకీయవేత్తలు. అయినా, వీరి మంచిచెడ్డలను గురించి బ్రిటిష్‌వారిలోనే ఈనాడు ఎంతమందికి తెలుసు? గ్లాడ్‌స్టన్ అంటే ఆ పేరుతో చెల్లుబాటు అవుతున్న ఒక చేతిసంచిని తొలిగా చేసి అమ్మినవాడని త్వరలోనే హెచ్చు మంది అనుకోగల ప్రమాదం కలదని ఎ. జి. గార్డినర్ ఎక్కడో వ్రాశాడు. ఇది అత్యుక్తి కాదు. ఇంత దేనికి? మాంట్‌ఫర్డ్ రిఫారమ్స్ రోజులలో మన చెన్నరాజధానికి ఎవ రెవరు ముఖ్యమంత్రులో, ఎవరితర్వాత ఎవరో, ఎంతెంత కాలమో ఈనాడు చెప్పగలవారు మనలో ఎంద రున్నారు?

కవివాక్కు పటిమకలదనడంనుంచి, అది అమోఘమైన దనడం ఒక మెట్టు; అది అమోఘమైన దనడంనుంచి, శాపోపసంహరణలశక్తి దానికి కలదనడం మరొక మెట్టు. ఈ మెట్టువరకు కొందరు యెక్కనే యెక్కారు. కవులు పెట్టిన శాపాలను గురించి కథ లనేకం. "పెద్దాపురపుకోట పెద్దమ్మకిల్లాట కవికోపకలన" వల్లనే జరిగిందట. వేముల వాడ భీమకవి—

గడియలోపలఁదాడి కడఁగి ముత్తునియాగఁ
దిట్టిన మేధావి భట్టుకంటె
రెండుగడెల బ్రహ్మదండి ముండ్లన్నియు
డుల్లఁ దిట్టిన కవిమల్లు భట్టుకంటె

మూఁడుగడెలకుఁ దా మొనసి యత్తినగండి
పగులఁదిట్టిన కవిభానుకంటె
అరజాములోపలఁ జెఱువునీళ్లింకంగఁ
దిట్టిన బడబాగ్నిభట్టుకంటె

ఉగ్రకోపి నేను నోపుదు శపియింపఁ
గ్రమ్మఱింప శక్తి గలదు నాకు
వట్టిమానఁ జిగురు పుట్టింప గిట్టింప
బిరుదు లేములాడ భీమకవిని

అని చెప్పుకున్నాడట. అయితే, కవుల ప్రతాపం తాళ్లు, బ్రహ్మదండి ముళ్లు, గళ్లు, చెరువునీళ్లు మొదలైన వాటి పైనే కాబోలని ఎక్కడ నవ్వుపోతారోనని కవులైనవారు రెండు చాటు పద్యాలను, వాటిని అతకడానికి ఒక కాకమ్మ కథను వేములవాడ భీమకవికి అంటగట్టారు. యాచనకు — కవులు చెయ్యిజాపితే యాచన అనరాదు. అంటే ముక్కు మెలివేస్తారు. అందువల్ల "ప్రాపుకు" అందాము — కళింగ గంగు ఆస్థానానికి భీమకవి వెళ్లాడట. ఏమి రాచకార్యంలో మునిగివున్నాడో కాని, ఇప్పుడు కాదు, మరొకసారి రమ్మని ఆ రాజు కాస్త చికాకు వెలిబుచ్చాడట. ఆ మాత్రానికే భీమకవి కాలరుద్రుడై —

వేములవాడ భీమకవి
వేగమె చూచి కళింగగంగు తా
సామము మాని కోపమున
సందడిదీఱిన రమ్ము పొమ్మనెన్

మోమును జూడ దోష మిక
  ముప్పదిరెండు దినంబు లావలన్
జామున కర్ధమం దతని
  సంపద శత్రులపాలు గావుతన్

అని ఒక శాపం తగిలించాడట. కవి శాపంపెట్టడమూ, దానికి తిరుగు వుండడమూనా? కళింగగంగు గర్భదరిద్రుడై, "పూవులమ్మినచోట కట్టెలమ్మడమా!" అని ప్రచ్ఛన్న వేషం వేసుకుని, దేశాంతరాలకు పోయి, తిరిపమెత్తుతూ పొట్టపోసుకుంటున్నాడట. ఈ అభాగ్య జీవితాన్ని గడుపుతూ ఒకనాటి రాత్రి చిమ్మచీకటిలో కన్నుకానక బొక్కబోర్లగా అత డొక గోతిలో పడిపోయి, "అయ్యో! దివ్వెటీకైనా గతిలేకపోయిందే?" అని వాపోయాడట. సరిగా ఆవేళకు పూలపాలకీ యెక్కి, కళ్లు జిగేలనే దివ్వెటీలతో ఆ దారినిపోతున్న భీమకవి "ఎవడవురా నువ్వు?" అని పలకరించాడట. "భీమకవిగారిచే జోగిచేయబడినవాడను" అని ఆ భిక్షుకుడు బదులుచెప్పగా, "రాజ కళింగగంగువా?" అని కవిరాజు మీసం మెలివేస్తూ (రాజసంకలవాడు గనక మీసం వుండేదనే అనుకుందాము) ప్రశ్నించాడట. ఈ ప్రశ్న వినగానే ముందు తెల్లబోయి, పల్లకీలోని పరమ పురుషుడు భీమకవేనని అల్లంతలో గ్రహించి, శిరస్సు వంచి, రెండు చేతులూ జోడించి, "మహాకవీ! నన్ను కరుణించు" మని కళింగగంగు సంప్రార్థనం చేసేసరికి—

వేయు గజంబులుండఁ బది
వేలు తురంగములుండ నాజిలో
రాయలగెల్చి సజ్జనక
రంబున బట్టముగట్టుకో వడిన్
రాయ కళింగగంగు కవి
రాజ భయంకరమూర్తిఁ జూడఁగాఁ
బోయెను మీనమాసమునఁ
బున్నమపోయిన పష్ఠినాటికిన్

అని మరొక ఆశుపద్యం చెప్పాడట. కినిసి పొమ్మన్నంతనే పోయినట్టు, కనికరించి రమ్మనగానే రాజ్యలక్ష్మి కళింగగంగు కాళ్లవద్దకు రానేవచ్చిందట.

భీమకవిని గురించి చెప్పబడే కట్టుకథ ఇదొక్కటే కాదు. గుడిమెట్ట గ్రామంలో తన గుర్రాన్ని సాగి పోతురాజు దొడ్డికి తోలించుకోగా, "నా జయమును, బోతరక్కసుని చావును నేడవనాడు చూడుఁడీ" అని కవిరాజు పద్యంలో ఒక విసురు విసిరాడట. అన్నట్టే, ఏడవనాడు సాగి పోత రాజు ఇహలోకంనుంచి సాగిపోయాడట. అయితే, తన గుర్రాన్ని తాను వెంటనే అప్పగింత పెట్టించుకోకుండా భీమ కవి వారంరోజులు గడువుపెట్టడంలో అంతరార్థ మేమిటో మనకు తెలియదు. మరొకమారు చాళుక్య చొక్క భూపాలునికి తన మహత్తును ప్రదర్శించి చూపడానికి ఆయన చిత్రకూటంలోని స్తంభాన్ని "ఆసీతాభ్యుపదానశృంఖళ కరాభ్యాలంచిత స్తంభమా!" అని సంబోధించి, "నేనే వేములవాడ భీమకవినేనిన్" అని భీషణ ప్రతిజ్ఞ చేసి,

"భూనవ్యాపృతపల్లవోపలతికా పుష్పోపగుచ్ఛంబులన్
నానాపుష్పఫలప్రదాయివగుమా నాకల్పవృక్షాకృతిన్"
అని శాసించేసరికి, చూస్తూ చూస్తూవుండగా ఆ స్తంభం రెమ్మలు సాగి, చిగుళ్లు వెళ్లి, మొగ్గ తొడిగి, పువ్వు పూచి, కాయలు కాచిందట. స్తంభం ఫలవృక్షమై కూర్చుంటే చిత్రకూటానికి చేటువస్తుందని కాబోలు, "స్తంభము రీతి నీ తనువు దాలిచి యెప్పటియట్ల యుండుమా?" అని తిరిగి ఆజ్ఞాపించేసరికి అది యథారూపం ధరించిందట!

నోరు పెట్టుకు బ్రతకవలసినవారు కాబట్టి, మాట బీరు పోదన్న నమ్మకం కలిగించుకోనిదే కవితావ్యాపారం సాగడం కష్టం కాబట్టి, ఈ కట్టుకథలను కవులు ప్రచారంచేసుకుని వుండాలి. ఈ "ట్రేడ్ సీక్రెట్" జోలికి మనం ఇంకా పోవడం న్యాయం కాదేమో!





# కాకి, కోయిల

దూరపుకొండ నునుపుకావడం దాని దూరంవల్లనే. దూరాన వున్నంతవరకే అది నీలికొండ. దూరంనుంచి చూచినంతవరకే అది దిశాచక్రాన్ని చుంబిస్తున్నట్టు భ్రమ. దూరాన్ని అధిగమించనంతవరకే దాని అద్దరిని ఏదో కొత్త ప్రపంచం అగాధ రహస్యాలతో, అలౌకిక సౌందర్యంతో చెన్నొందుతున్నదన్న తియ్యని ఆశ, దాన్ని చేరలేనందుకు తరగని ఆవేదన. దగ్గరికి వెడితే అన్ని అందాలు కరిగి పోతాయి; అన్ని భ్రమలు చెదిరిపోతాయి. ఎదట నిలిచేది ఎగుడు దిగుడు రాళ్ళగుట్ట; ఎండ వేడిమిని కక్కే కంకరమిట్ట.

రాజును చూచిన కళ్లను మగడిని చూస్తే మొట్టబుద్ధి పుట్టడం రాజు నవమన్మథుడు కావడంవల్లనూ కాదు; మగడు పందుకోతి కావడంవల్లనూ కాదు. రాజు పున్నానికో, అమావాస్యకో తప్ప దర్శన మివ్వడు; మగడు మెడలో తాను కట్టిన పుస్తెవలెనే చెంతబాయనివాడు. అందువల్లనే రాజును చూచినతర్వాత మగడు కంట దూరక పోవడం. పనిమీద అతడే పదిరోజులు పరాయివూరు వెళ్లి వస్తే, రారాజువలె కనబడతాడు.

ఇంతకీ చెప్పవచ్చింది నిరంతరాయ సామీప్యం విసువు నెత్తిస్తుందని; నిరంతర సాహచర్యం వెగటు పుట్టిస్తుందని. దీన్నే శాస్త్ర ముతకగా చెప్పాలంటే, "చూడగా చూడగా గుఱ్ఱం గాడిద అవుతుంది". కాకి చేసుకొన్న పాపం, కోయిల చేసుకున్న పుణ్యం ఇంతలోనే వున్నది.

పొగ కనబడితే నిప్పు రాజుతున్నట్లు తీర్మానించుకో వచ్చునంటారు. ఇదే విధంగా కాకి కనబడితే చెంతలో ఊరు, పల్లె వున్నవని తీర్మానం చేసుకోవచ్చునేమో: "ఊరపిచ్చుక", "ఊరపిల్లి" అన్నట్లు "ఊరకాకి" అనము గాని, కాకి ఊరును నమ్ముకుని బ్రతికేదే. అడవికుక్క, అడవికోడి, అడవిబీర, అడవిచిక్కుడు, అడవిమల్లె, అడవి మొల్ల—ఇత్యాది ప్రాణ్యంలో నమోదైవున్నా, "అడవి కాకి" కనబడదు. నీరుకాకి, జెముడుకాకి వున్నప్పటికీ అవి కాకిజాతిలో వేరే తెగలు. మాలకాకి, పీతికాకి, బొంతకాకి, సాదాకాకివలె, మనతోపాటు ఊళ్లలో, పల్లెలలో బ్రతికేవే.

మనతోపాటు ఒకే చోట బ్రతకడమే కాక, కాకి మన బ్రతుకులో భాగం పంచుకుంటుంది.

చుట్టపక్కాలు రాకముందే వారి ఆగమనవార్తను కాకమ్మ మనకు గంతువేసి అందిస్తుంది. కాకి కుయ్యనారంభించగానే "ఈ రేషన్‌రోజులలో ఎవరిని తెస్తున్నావమ్మా—నెత్తి నెక్కించడానికి!" అని యిల్లాళ్లు ప్రస్తుతం విసుక్కుంటున్నా రనుకోండి. కాని, కాకికూస్తే కొత్తగా కాపురానికి వెళ్లిన పెళ్లికూతురుముఖం ఎంత విప్పారుతుంది: అమ్మ వస్తున్నదో, నాన్న వస్తున్నాడో, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు ఎవరువస్తున్నారోనని ఎంత సంబరపడుతుంది! క్షణక్షణం పెచ్చుపెరిగే అసహనంతో కళ్ళు కాయలుకాచేటట్టు ఎంతగా ఎదురుతెన్నులు చూస్తుంది! ఆశాభంగమైతే కాకిని పట్టుకుని నిలువునా ఎన్ని దులిపివేస్తుంది! కన్నవారింటిపై గాలి తిరిగి అక్కడికి వెళ్లి పదిరోజు లున్నా, మళ్ళీ కళ్లన్నీ కాకమ్మమీదే.

కాకమ్మా, కాకమ్మా, కల్లాలమ్మా!
చుట్టాలొస్తే చూచిపో
పక్కాలొస్తే పారిపో
ఇరుగువారొస్తే ఇంటిమీద దెక్కు
పొరుగువారొస్తే పొయ్యిమీద దెక్కు
మావారొస్తే ఇటు కాలుతీసి అటు వెయ్యి
నీ కూతురుకి వెన్నముద్ద పెడతా
నీ కాలికి గజ్జె కడతా

ఇక, ఎంకిని పోలిన విరహిణులైతే "కాకమ్మతోనైన కబురంప డా రాజు!" అని పూర్తిగా కవిత్వధోరణిలోనే పడతారు.

దినవెచ్చాలడిగినా, జీతభత్యాలడగకుండా మనకు కబుర్లు జేరవేసే టపా బంట్రోతుగా పనిచేసిపెట్టడమే కాక, కాకి మనకు శకునాలనుకూడా చెబుతుంది. ఇందుకు ఒక శాస్త్రానికి శాస్త్రమే — కాకశాస్త్రం — విపులమైంది వున్నది. ప్రయాణసందర్భంలో ఊరునుంచో, ఇంటినుంచో కదులుతుండగా కాకులు కుడినుంచి ఎడమకు వెళ్ళితే వెళ్లబోతున్న పని పండు అవుతుంది. ఊరునో, యింటినో ప్రవేశిస్తుండగా శుభం కలగాలంటే కాకులు కుడినుంచి ఎడమకు కాక, ఎడమనుంచి కుడికి వెళ్లాలి. ప్రయాణం, ప్రవేశ కాలాలలో తప్ప, మార్గమధ్యంలో కాకుల శకునం పాటించనక్కర లేదు. (పాటిస్తే ఏ ప్రయాణం సాగదు కాబట్టి.) కాకి మొదట కుడినుంచి ఎడమకు వెళ్లి, వెంటనే ఎడమనుంచి కుడికి వస్తే, చావు తప్పినా కన్ను లొట్టపోగల కీడు మూడిందన్నమాటే. ఎడమనుంచే బయల్దేరి...ఇక, చాలునేమో ఈ శకునాలప్రసక్తి.

పక్షి ఫలుకులన్నా, శకునాలన్నా వెర్రి నమ్మకాలు లేని వారికైనా, కాకితో పనిపడకుండా పూర్తైన జరగదు. కూడని వస్తువును "యిస్తారా, ఛస్తారా?" అని పసికూన మారాం చేస్తుంటే, దానిపైనుంచి వాడిమనస్సు మళ్ళించ

డానికి కాకమ్మ శరణ్యం కావలసిందే. మెడను వొయ్యారంగా ఇటు వంచుతూ, అటు వంచుతూ, "ఎంగిలిచేతితోనైనా నాకు విదల్చరాదా?" అని వగలు చూపుతూ, చూరుపైనో, మదురుపైనో కూర్చున్నదాన్ని "హూష్ కాకి?" అని ఉత్తిచేతి విదలింపుతో హడలగొట్టి, పైపెచ్చు దానికి దొంగరికం అంటగట్టాలి. పిల్లవాడు అలిగి, మూతి ముడుచుకుని మూలకు వెళ్ళి కూర్చుంటే, చేతులు జాచి, కళ్ళు మూసుకున్నట్టు నటనచేస్తూ, "కాకి వస్తుందో, పిచ్చుక వస్తుందో, మా అబ్బాయి వస్తాడో" అంటూ నాటకమాడాలి. మనమడు నిద్రపోవాలంటే తాత "అనగనగ ఒక కాకి...." అంటూ కాకమ్మ కథను అందుకోవాలి. తింటున్న తాయాన్ని జతపిల్లలకు కాస్త కొరికి పెట్టాలంటే బుడతలు దాన్ని "కాకి ఎంగిలి" చెయ్యవలసిందే. ఇంతగా కాకమ్మ మన బ్రతుకులో భాగం పంచుకొంటున్నా—కాదు, ఇంతగా భాగం పంచుకోబట్టే—దానిపట్ల మనకు నిరసన, న్యూనభావం. ఇందుకు తార్కాణం ముఖ్యంగా మన భాషే.

ఏదైనా ఎక్కువ నలుపైతే అది "కాకినలుపు." ఎవరైనా ఎక్కువ గోలపెడితే అది "కాకిగోల". అల్లరిచిల్లరివారు గుంపుగా గుమిగూడితే అది "కాకిమూక". ఇన్నూరు, మున్నూరుమంది బారులు తీర్చికూర్చుంటే అది "కాకులబడి". హీనపు బ్రతుకు "కాకిబ్రతుకు". ("కాకి చిరకాలమున్న నే కార్యమగును?" అన్నాడు కవిశేఖరు

డొక్కడు.) ఆకస్మికపు చావు "కాకిచావు". ముట్టరాని కూడు "కాకికూడు". కర్ణకఠోర సంగీతం "కాకిసంగీతం". పిల్లజుట్టు "కాకపక్షం". కనిపించినంతనే పొడిచే పగ "కాకిపగ". కుహనా బంగారం "కాకిబంగారం". మామూలు తప్పినవి "కాకిదొండ", "కాకినేరేడు", "కాకిపెసర", "కాకిచెరకు" వగైరా వగైరా. దిక్కూదివాణం లేనివాడు "ఏకాకి". లోకానుభవం లేనివాడు "పిల్లకాకి". ఇతరులతో కలవనివాడు "మాలకాకి". అపురూపమైంది "తెల్లకాకి". నమ్మరాని కథ "కాకమ్మకథ". కష్టనిష్ఠురాలలో చిక్కుకున్న దౌర్భాగ్యుడు "కంపనపడ్డ కాకి". ఇక లోకులందరు "పలుగాకులు". చొరరానిది "కాకులు దూరని కారడవి". పనికిమాలిన పని చెయ్యడం "కాకదంత పరీక్ష". దూష్యమైందని వీధిలో విసురుపుచ్చుకు పారవెయ్య వలసింది "కాకిముట్టిన కుండ". ఆకార, అనాకారాలకు జరిగిన పెళ్ళి "కాకి ముక్కు పగడం", లేదా "కాకి ముక్కుకు దొండపండు". ఇంత దేనికి? కాకి అంటేనే "అల్పం" అని నిఘంటుకారుడు అర్థం చెబుతున్నాడు.

కాకమ్మకు పచ్చి అన్యాయంచేస్తూ ఎన్నో పలుకుబడులు, నుడికారాలనే కాక, అనేక సామెతలనుకూడా మనం సృష్టించుకున్నాము. "కాకి పుట్టీ నలుపే, పెరిగీ నలుపే". కావచ్చు, కాని, పుట్టిననాటి నలుపు పెరిగేసరికి కోవెలకైనా తగ్గుతుందా? పోనీ, నల్లగా పుట్టిన నరులైనా, ఎంత

టాల్కం పౌడర్ కొట్టుకున్నా, తెల్లవా రౌతున్నారా? "కాకిపిల్ల కాకికి ముద్దు". నిజమే! ఎవరిపిల్ల ఎవరికి ముద్దు కాదు? "కాకిని తెచ్చి పంజరంలో పెడితే చిలకవలె పలుకుతుందా?" అయితే, చిలుకను కోయిలవలె కుయ్యమనండి—తలలో జేజి దిగివచ్చినా అది దాని తరమౌతుందేమా! "గంగలో మునిగినా కాకి హంస అవుతుందా?". కాక పోవచ్చు, కాని, తాను తానుగా వుండక, మరొకటిగా చెల్లుబాటు కావాలన్న ఖర్మ కాకికి ఎందుకు పట్టాలి? "మెతుకులు చల్లితే కాకులకు తక్కువా?". ఊరికే వస్తే మావాడు మరొక డున్నాడని మానవులే గుమిగూడ తారు—కాకులు చేరడం ఒక లెక్కా? "కాకి గండాగుండి కాని, కోయిల పిరికి". ఒక్క కాకిని మినహాయిస్తే పిరికితనం కూడా మెచ్చుకోదగ్గ గొప్పగుణమే కాబోలు!

ఇంతకూ కాకి "ఛీఛీ", "ధూధూ" అనిపించుకో డానికేమి, కోకిల "వహ్వా, వహ్వా", "భేష్ భేష్" అని పించుకోడానికేమి కారణం, మొదటిది మన మధ్య మనతో పాటు కాలక్షేపం చెయ్యగా, రెండవది ఇటు వచ్చి, అటు పోయి, ఎదటపడీ పడకుండా మురిపించడం. కాకికి లేని అందం కోవెలకేమీ వొలికిపోవడం లేదు. కాకి ఎంత నల్లనిదైనా, కోయిలకంటె ఒకటి, రెండు చాయ లెక్కువేకాని తక్కువ కాదు. వొళ్లు నలుపైనా కాకిమెడ అంత నలుపు కాదు. (మాలకాకి మాట ఇక్కడ విడిచిపుచ్చండి.) కోయిల

నిలువెల్లా నలుపు. ఏ రంగుకైనా నిగారింపు బాగుంటుంది కాని, నలుపురంగుకుమాత్రం కాదు. కోకిల నలుపు నిగనిగలాడేదే. ఈ సంగతి సందర్భాలన్నీ తెలిసికూడా పెద్దలు "కాకపికన్యాయం" అన్నారు. కాకీ నలుపే; కోకిలమూ నలుపే. అయినా, రెండవదానివిషయంలో అందచందాలు లెక్కకు రావట. తేనెలొలికే దాని కంఠం దాని వికారాన్ని కప్పివేస్తుందట. అసంబద్ధమైన ఈ మాటను పెద్దలు "కాకపికన్యాయం" అనడానికి మారుగా "కాకపిక అన్యాయం" అంటే సత్యానికి చేరువగా వుండేది. ఏదైనా ఒక్క సలక్షణమే ఎన్ని అవలక్షణాలనైనా కప్పివెయ్యగలిగితే, మానవాళిలో సత్పురుషులు కానివా రెవ్వరు? సమ్మాన్యాలు కానివా రెవ్వరు?

కాకిగొంతు కటువుగా వుంటుందనడం కాదనరాని మాట. నిస్తబ్ధత గర్భాన్ని చీల్చుకొని "కాఁకాఁ" రవంవస్తే అది చెవికి ఘోరవంగా వుండేమాట కూడా నిజం. కాని, కాకి కూంత వినబడినంత తరచుగా కోయిలపాట కూడా వినవస్తే ముఖంమొత్తడానికి యేళ్లూ పూళ్లూ పట్టదు; ఘడియో, అరఘడియో చాలు. ఏ మామిడిగున్న లేజిగుళ్ల మధ్యనో దాగి "కో" అని కోయిల నాలుగుసార్లు అంటే, మనం ఎదురు నాలుగుసార్లు "కో" అంటాము. అది నలభైసార్లు "కో" అంటే, మరి దానిసంగతే మనం పట్టించుకోము. ఇంకా కూస్తే "ఏమిటీ పాడుసొద" అనేమాట రానే వస్తుంది. ఇంకొక విషయం: ఆ సమయంలో విన

బడినా, కాకి అరుపు చెవికి బాధ కలిగిస్తుందే తప్ప గుండెను తరగదు. సమయం కాని సమయంలో ఈ గుండెకోత కోయిల పాట కున్నది, అందుకనే—

పాడవే కోకిలా!
పాడవే యింపుగా!
ప్రాణముల్ హాయిచే
పరవశ మ్మొందగా!
పాట పాడవె తీయగా,
కోకిలా!
పాట పాడవె తీయగా!

అని అర్థించిన బసవరాజు అప్పారాయకవి మరొక సందర్భంలో తానే—

తీయనీ రాగాలు తీయబోకే,
తీపితో నా మనసు కోయబోకే,
కోయిలా, కోయిలా
కూయబోకే

అని ప్రాధేయపడవలసి వచ్చింది. "యెంకి దూరానుండె, యేటిదరి నే నుంటి సావాస మింకెవరు, సంద డెవరో" అని, "యేటి కడుపున దాగి తోట నిదరోయింది, ఆలనా, నా పాదకు పాలనా" అని నిట్టూరుస్తుండగా కొమ్మలో కోయిల "కో" అనేసరికి నాయుడుబావకూడా "రాగతనమో యేమొ బాగు వో గెరుగదే" అని విసుగుదల చూపవలసివచ్చింది.

ఏమైనా కోకిలమ్మ కేమి?—భాగ్యశాలి బ్రతుకు! ఊద్చుకో నక్కరలేదు, ఎత్తిపోసుకో నక్కరలేదు, అలికి ముగ్గులు పెట్టుకోనక్కరలేదు. హాయిగా ఏ కొమ్మపైనో "మఠం నిద్ర." వండనక్కరలేదు, వార్చనక్కరలేదు, ఇటు పుల్ల అటు పెట్టనక్కరలేదు. సుష్ఠుగా మామిడిచిగుళ్ల "సత్రం భోజనం". కన్నా, పెంచనక్కరలేదు. జీతం నాతం లేకుండా ఆ భారం మొయ్యడానికి, ఆ బాధ పడ్డానికి కాకమ్మ వుండనే వున్నది. లేచినమ్మ లేచినట్టు నొవ్వకుండా, నొచ్చుకుండా, చక్కగా దిద్దుకుని "రింగు రంగా" అంటూ కూర్చోవచ్చు. అయినప్పుడు కోకిలమ్మ గొంతెత్తి పాడుతుంది, గొప్పగా పాడుతుంది—పాడ కేమి చేస్తుంది? అది వెళ్ళబోస్తున్న వైభోగంలో అరవయ్యోవంతైనా కాకమ్మకుంటే దానిదీ కలకంఠమే అయ్యేది!

దాని బ్రతుకే పచ్చిమోసంబ్రతుకు. కనుక కోకిలమ్మ పాడ నా కెంతమాత్రం గిట్టదు. "కో" అంటూ పట్టరాని పొంగుతో అది కూసిన ప్రతిసారి నాకు టోపీపెట్టిన ప్రతి వాడు నాచాటున ఇలాగే కులుకుతాడేమోనని అనిపిస్తుంది. టోపీదాసుల చేతిలో నావలె టోకరాలు తినేవారిపట్ల నాకు సహజంగావున్న సానుభూతిలో కొంతభాగాన్ని కాకమ్మ కూడా పంచుకుంటుంది. చితుకు చితుకు చొప్పున యేరుకుని, ఏ చెట్టు కొమ్మమీదో కష్టపడి గూడుకట్టుకుని, గుడ్లు పెట్టు కుని, వాటిని పొదుగుతూవుండగా కాకి జంటను కావాలని

కోయిల దంపతులు కయ్యానికి కవ్విస్తాయట. రోషంవచ్చి కాకులు వెంటపడగా వాటిని గిరికీలు పెడుతూ గూటి నుంచి దూరానికి లాక్కుపోతాయట. అప్పుడు కయ్యం నుంచి ఆడ కోయిల నేర్పుగా తప్పుకుని, కాకిజంట గూటిని చేరి గుడ్లు పెట్టివేస్తుందట. లెక్కా డొక్కా తెలియని వెర్రిమొగాలు కాబట్టి, తమ గుడ్లే అనుకుని కోయిల గుడ్లనుకూడా కాకులు పొదుగుతాయట. అంతే కాదు. తమ బిడ్డలనుమించి పరాయి పిల్లలను పోషణ చేస్తాయట! వెర్రికాకమ్మను ఇంతగా మోసగిస్తుండే కోయిలను మెచ్చుకునే వారందరు నా దృష్టిలో వంచనకు జోహారు లర్పిస్తున్నవారే.





# "రిపార్టీ"

ఎల్లనాడు బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో నేను రెండు నెలలపాటు మకాం వెయ్యాడం తటస్థించింది. అప్పు డొక నాడు స్వగ్రామానికి పనిమీద వెళ్లగా బాల్యమిత్రు డొకడు యెదురుపడి, తెలివి వొలకబోసుకుంటూ "ఏమోయ్! మీ కళాశాల గాడిదలు యెలా వున్నాయ్?" అంటూ పలకరించాడు. అందుకు నేను చిరునవ్వుతో "నీ కింత బంధుప్రేమ వున్నదని ఇంతకుముందు నాకు తెలియదుసుమా!" అని జవాబిచ్చాను. మావాడి కొంటె ప్రశ్నకు నే నిచ్చిన కొంటె జవాబుకు ఇంగ్లీషులో "రిపార్టీ" అంటారు. దెబ్బకు దెబ్బ కొడితే అది రిపార్టీ కాదు; దెబ్బను మించిన దెబ్బపడాలి, నోరు మూయించివెయ్యగల దెబ్బపడాలి, దెబ్బతిన్నవాడు చెంప సవరదీసుకుంటూ గుడ్లనీళ్లు గుడ్ల కుక్కుకున్నా, మిగతావారు పడినదెబ్బ మహా మజాగా పడిందని మెచ్చుకోవాలి—అట్టిదే రిపార్టీ కాగలదు.

ఎదటివాడు అల్లరిగానో, ఆగడంగానో, ఎకసక్కెంగానో, ఎగతాళిగానో, ఎత్తిపొడుస్తూనో, ఏడ్పించాలనో ఏదో కొంటెమాట అనేసరికి తెల్లబోకుండానూ, తడుముకోకుండానూ గోడ్డలిపెట్టు పెట్టినట్టు ఠపీమని జవాబుచెప్పి నోరు మూయించగలవాడు కాటిలో పెట్టినా లేచి రాగలడు. నిదర్శనానికి లాయడ్ జార్జినే చూడండి; పుట్టింది బడి పంతులు కడుపున; తను పసివాడై వుండగానే తండ్రి పోయాడు; పెద్ద చదువులు చదవలేదు. అయినా, గ్రేట్ బ్రిటన్‌కు ప్రధాని కాగలిగాడు; ఒక పట్టులో ప్రపంచం భవిష్యత్తునే తమ చేతిలో పెట్టుకున్న ముగ్గురిలో తానొక్కడయ్యాడు. లాయడ్ జార్జి ఇంతగా యెక్కిరావడానికి కారణ మేమంటారు? నన్నడిగితే రిపార్టీ లివ్వడంలో ఆయన సత్తాయే! అంటే, రిపార్టీలను ఎడాపెడా విసరడంవల్లనే ఆయన జయించుకు రాగలిగాడని నా తాత్పర్యం కాదు. రిపార్టీలలో ఆయన మొనగాడంటే ఆయన మెదడు కునికిపాట్లు యెరగనిదన్నమాట. అట్టివారు కాలానికే ఎదురీద గలుగుతారు.

లాయడ్ జార్జి విసిరిన రిపార్టీలు లెక్కలేనన్ని. మచ్చుకు రెండు, మూడింటిని మాత్రం ఇక్కడ పేర్కొంటాను: ఒకనాడు ఎలక్షన్ మీటింగులో ఆయన ప్రసంగిస్తున్నాడు. అప్పుడు సభలోనుంచి ఒక అమ్మి తుపానులా లేచి "నేనే నీపెళ్ళాన్నైతే నీకు తప్పక విషమిచ్చి వుండేదాన్ని" అన్నది. అందుపై ఆయన కొంటె చిరునవ్వుతో "నేనే నీ భర్తనైతే

దాన్ని తప్పకుండా పుచ్చుకునేవాణ్ణి" అన్నాడు. ఇంకొక సారి ఎలక్షన్ మీటింగులోనే ఒక కొంటె కోణంగి "అయితే మీ తాత గంత గాడిదను తోలుకునేవాడు కాదటయ్యా?" అని వెక్కిరించాడు. దానికి "గంతమాట ఏమో నేను వినలేదుగాని, గాడిదమాత్రం నా యెదట ప్రత్యక్షంగా వుంది" అని ఆయన జవాబు. వేరొక సందర్భంలో లాయడ్ జార్జి "హోంరూల్"ను గురించి వేల్సులో ముచ్చటిస్తున్నాడు. "ఐర్లెండ్‌కు హోంరూల్ కావాలి; స్కాట్లెండ్‌కు హోంరూల్ కావాలి; వేల్సుకు హోంరూల్ కావాలి; బ్రిటన్‌కు..." మాటకు అడ్డువచ్చి, సభలోవున్న ఒక త్రాగుబోతు "నరకానికో?" అన్నాడు. వెంటనే "ఓం! నరకానికికూడా హోంరూల్ కావలసిందే! స్వదేశం అంటే ఇంత భక్తి చూపిన ఆ పెద్దమనిషి ఎవరోగాని ఆయనకు నా ధన్యవాదాలు" అని లాయడ్ జార్జి దెబ్బతీశాడు.

ఈనాటి రాజకీయవేత్తలలో లాయడ్ జార్జిని రిపార్టీలో మించగలవారు లేరనే చెప్పాలి. తాను ఉపన్యసిస్తుండగా కొంటెప్రశ్నలు పడాలని ఆయన నిజానికి కోరుకునేవాడు. అలా ప్రశ్నలు పడకపోతే ఆయన బుద్ధి ప్రకోపించేదీ కాదు, ఉపన్యాసం రక్తికట్టేదీ కాదు. కామన్సులో ఏదైనా తీవ్ర చర్చ జరుగుతున్నప్పుడు దానిలో పాల్గొనడానికి ఆయన లేచా డనుకోండి. అప్పుడు అడ్డదిడ్డంగా ప్రశ్నలు వేసి, ఆయనకు అడ్డుతగిలారో మాడు పగిలిందన్నమాటే! అలా కాకుండా చెవులప్పగించి, మెదలకుండా కూర్చుంటే పసగల

ధోరణిలో పడకుండానే ప్రసంగం తగలబడిపోయేది. లాయడ్ జార్జి ఈ ప్రవృత్తికి చర్చిల్ మన స్తత్వం పూర్తిగా భిన్నం. ఉపన్యాసం ముందుగా వ్రాసుకుని, దాన్ని కంఠోపాఠంచేసి, ఆ తర్వాతే ఆయన పార్లమెంట్‌కు వస్తాడు. చాలా సంవత్సరాలక్రితం చర్చిల్ అతిథిగా ఆయన యింట బసచేస్తున్న ఒక పెద్దమనిషి కాసేపు గాలిపోసుకువద్దామని తోటలోకి షికారు వెళ్లగా, ఒక పొదరిల్లు అవతలనుంచి "మిస్టర్ స్పీకర్, సర్, తలవనితలంపుగా ఈ చర్చలో నేను జోక్యం కలిగించుకోనక తప్పలేదు. నేడు ఈ విషయంపై నేను ప్రసంగించవలసి వస్తుందని కలలోనైనా అనుకోలేదు. కాని, ఇప్పుడే తన ఉపన్యాసం ముగించి కూర్చున్న నా మిత్రుడు చేసిన కువిమర్శలను విన్నమీదట....." అంటూ చర్చిల్ కంఠం కంచుగంటవలె మ్రోగుతున్నదట. మరొక గంటకో, రెండు గంటలకో తాను చేయనున్న ప్రసంగాన్ని చర్చిల్ బట్టీ పట్టుతున్నట్టు చప్పున గ్రహించుకుని తా నప్పుడు కంటబడ్డం బాగుండదని ఆ పెద్దమనిషి పిల్లి అడుగులు పెట్టుకుంటూ యింటిలోపలికి చక్కాపోయాడట. ఈవిధంగా కంఠస్థంచేసుకువచ్చిన ప్రసంగాన్ని అపవారించకుండా సభ్యులందరు విన్నారా, తుక్కురేగేటట్టు చర్చిల్ దాన్ని అప్పజెప్పివేస్తాడు; ప్రతిపక్షుల వాదం ఎంత బలంగావున్నా దాన్ని చీల్చి చెండాడతాడు. అలాకాకుండా ఎక్కడి కక్కడ అడ్డువచ్చి, మాటను త్రుంచివేస్తే, తికమక పడతాడు, తబ్బిబ్బులౌతాడు, ప్రసంగం సారస్యమే చెడుతుంది. అయితే

చర్చిల్‌కైనా రిపార్టీలు విసరగల తాహతు కొంతవరకు లేకపోలేదు. ఇప్పుడు లేదుగాని, ఒకప్పుడు చర్చిల్ మీసాలు పెంచుతూవుండేవాడు. ఆకాలంలో ఒకానొక సుందరి "మిమ్మ్ము చూస్తే రెండు విషయాలు నాకు నచ్చవు" అని చర్చిల్‌ను చూచి అన్నదట. అటుపిమ్మట సంభాషణ క్రమ మిది :

"ఏమిటవి ?"

"మీ రాజకీయాలూ, మీ మీసాలూ."

"కావచ్చుగాని, ఈ రెండింటిలో దేని స్పర్శా మీకు తగలగల ప్రమాదం లేదుకదండీ!"

మీసాలు పెంచడం, తియ్యడం చేసినట్టే, పార్టీల విషయంలోకూడా చర్చిల్ రంగులు ఫిరాయించాడు. టోరీల నుంచి చీలి, లిబరల్స్‌లో ఆయన చేరినప్పుడు ఆక్స్‌ఫర్డ్ యూనియన్‌లో ఒక డిబేట్‌లో ఆయన పాల్గొంటున్నాడు. ఎదటిపక్షాన వాదం చేస్తున్న లార్డ్ బర్కెన్‌హెడ్ (అప్పటికి ఆయన లార్డ్ కాలేదు; యఫ్. ఇ. స్మిత్‌గానే వున్నాడు) "లిబరల్స్ నరకంలోనైనా మైనారిటీగానే వుంటారు" అని ఎత్తిపొడిచాడు. అందుపై చర్చిల్ "నరకంలోనైనా టోరీలకు ఖచ్చితంగా మెజారిటీ వున్నదనడానికి నేను సంతోషిస్తున్నాను" అని మాటకు మాట అసలు ఫాయిదాలతో అప్పగించాడు.

రాజకీయరంగంలోవలె న్యాయస్థానాలలోనూ రాణించడానికి రిపార్టీ ముఖ్యావసరం. సాక్షి కానివ్వండి, మొదటి

పక్షం వకీలు కానివ్వండి, చివరికి జడ్జీయే కానివ్వండి— ఏమాత్రం సవ్యంతప్పి మాట్లాడినా ఫెడీమని నోటిపై కొట్ట గలిగితే పంట పండిందన్నమాటే. పేరందిన న్యాయవాదు లందరు రిపార్టీలో దిట్టలే. ఈ విద్యలో ఐరిష్ బారిస్టర్ ఫిల్‌పాట్ కుర్రన్‌కు పెట్టింది పేరు. కుర్రన్ ఒకనాడొక జడ్జిముందట వాదిస్తున్నాడు. ఆ జడ్జికి ఒక పెంపుడు కుక్క వుండేది. దాన్ని కోర్టుకు తోడుకువచ్చి తన ఆసనంపక్కనే కూర్చోబెట్టుకునేవాడు. కుర్రన్ ఒక్క పదినిమిషాలపాటు తనవాదం వినిపించాడో, లేదో "సరే, నీ సొద నువ్వు కానిచ్చుకో?" అన్నట్టు ముఖంపెట్టి, ఆ జడ్జి కుక్కవైపు తిరిగి దాన్ని నిమరడం ప్రారంభించాడు. కుర్రన్ వెంటనే తనవాదన నిలిపివేశాడు. "ఆగిపోయారేమి? కానివ్వండి" అన్నాడు జడ్జి, తలైనా యెత్తకుండా. "మరేమీ లేదు, స్వామీ! సలహా చేస్తున్నారేమోనని ఆగిపోయాను" అని కుర్రన్ చుర్రున వాత పెట్టాడు. ఈ జడ్జీయే ఇంకొకసారి "మీరు చెబుతున్నదే లా కాగలపక్షంలో నా లా పుస్తకాలను తగలబెట్టుకోవలసిందే" అనగా, "ఆ పని చెయ్యడంకంటె, వాటిని చదువుకోవడం మేలుకాదా, దేవరా?" అని కుర్రన్ చిన్న చురక తగిలించాడు. లార్డ్ ఎషర్ కూడా జడ్జిగా ఆస్వాల్డ్ అనే లాయర్ చేతిలో ఇలాంటి దెబ్బే తిన్నాడు. ఆస్వాల్డ్ వాదనకు అడ్డువచ్చి "జడ్జీలకైనా కొంత కామన్‌సెన్స్ వుంటుందని మీరు వొప్పుకోవాలి" అని ఎషర్ అన్నాడు. "చిత్తం! అలా అనుకునే కింది కోర్టులో పొరపడ్డాను" అని ఆస్వాల్డ్

దెబ్బతీశాడు. సాక్షి నొకనిని క్రాస్ ఎగ్జామినేషన్ చేస్తూ సర్ ఎడ్వర్డ్ కార్సన్ "నువ్వు తాగుతావా?" అని ప్రశ్నించగా అతడు "అది నా వ్యవహారం—మీకు దేనికి?" అని కోపంగా బదులిచ్చాడు. "సరే నయ్యా! ఇదొక్కటేనా, వేరే వ్యవహారం ఏదైనాకూడా వున్నదా?" అని సర్ ఎడ్వర్డ్ వెంటనే మరొక ప్రశ్న వేశాడు. ఇంకొక కేసులో ఒకానొక సాక్షి సాక్షాత్తు ఆ సత్యహరిశ్చంద్రుడి పోజ్ పెట్టి "నిజానికీ, నాకూ చిన్నతనంనుంచీ లంకె" అన్నాడు. "కావచ్చునయ్యా! కాని, విడాకులిచ్చుకుని ఎంత కాలమైందనే మాప్రశ్న" అని ఆ కేసును విచారిస్తున్న జడ్జి, లార్డ్ డార్లింగ్, అతడి నోరు మూయించాడు. ఆ జడ్జి పేరుగాని, ఆ లాయర్ పేరుగాని మనకు తెలియకపోయినా, కోర్టుకు సంబంధించి కండగల రిపార్టీ మరొకటి వున్నది. జడ్జి తలబిరుసువాడు. కేసు విచారిస్తూ రెండు కాళ్లూ యెత్తి టేబుల్ పై పెట్టాడు. కేసులో పని చేస్తున్న లాయర్ గడసరి. చేస్తున్న వాదాన్ని వాక్యం మధ్యలో ఆపివేశాడు. "మరి చెప్పవలసిందే లేదా?" అన్నాడు జడ్జి. "చాలా చాలా వున్నదండి. కాని, తలకు చెప్పాలో, మొలకు చెప్పాలో తెలియక ఆగిపోయాను" అన్నాడు లాయర్. "దేనికైనా సరే" అని రుసరుస లాడాడు జడ్జి. "చిత్తం! తలలో ఎంత లా వున్నదో, మొలలో అంతే లెండి!" అని నషాళానికి అంటే దెబ్బతీశాడు లాయర్. తప్పీమని కాళ్లు దించి, సరిగా కూర్చున్నాడు జడ్జి.

మన కోర్టులలోకూడా లాయర్ల రిపార్టీలు లెక్కలేనన్ని. అలహాబాద్ హైకోర్టులో పండిట్ మోతీలాల్ నెహ్రూ ఏదో కేసులో సాక్షిని విచారిస్తుండగా అతడు "నేనేం వెధవ ననుకున్నారా?" అని తీంద్రించాడట. అందుపై మోతీలాల్ "రామరామ! కలలోనైనా మీ రట్టివారని నే ననుకోలేదు. కాని, నేను పొరపడి వుండవచ్చుగా, స్వామీ", అని మెత్తని చెప్పుతో మెత్తని దెబ్బ కొట్టాడు. సర్ రాసబిహారి ఘోష్ కలకత్తా హైకోర్టులో ఆర్గ్యుమెంట్ చెబుతుండగా జడ్జి "మీరు నాకు లా బోధించనక్కరలేదు" అని కసురుకున్నాడు. "చిత్తం! తమకు నేను ఏమీ బోధించ లేను!" అంటూ, "ఏమీ" అనే ముక్కను నొక్కిపలికి, "తమరు మూర్ఖశిఖామణులు" అన్నట్టు ధ్వనించి, ఆ జడ్జి మళ్లీ నోరెత్తకుండాచేశాడు, సర్ రాసబిహారి. రిపార్టీల విషయంలో వీ రిద్దరికంటె ఘనుడు కీర్తిశేషుడైన భాష్యం అయ్యంగార్. ఆయన మద్రాసు హైకోర్టులో ఒకనాడు వాదిస్తుండగా జడ్జి "మీరు మరి వాదించి లాభంలేదు. ఇక మీరేమిచెప్పినా, మీమాటలు ఈ చెవిగుండా లోపలికి పోతే, ఆ చెవిగుండా బయటికి దూసుకుపోతాయి" అన్నాడట. "యస్, మైలార్డ్! ఆ రెండు చెవులమధ్య (మాటను అడ్డడానికి) ఏమైనావుంటే కదండీ" అని భాష్యం అయ్యంగార్ దెబ్బతీశాడట. స్నేహితుడైన ఒక జడ్జి యింటికి సాయంత్రంపూట ఆయన ఖులాసాగా వెళ్లేసరికి జడ్జిగారి కుక్క "భౌ! భౌ!" అని మొరుగుతూ పైకి దూకబోయిందట. జంకి భాష్యం

అయ్యంగార్ ఒక అడుగు వెనక్కు వేసేసరికి "మొరిగే కుక్క కరవదని సామెత వున్నది—మీరు వినలేదా?" అని జడ్జి నవ్వాడట. "ఆ సామెత నేను విన్నాననుకోండి. కాని, మీ కుక్క వినలేదేమోనని సంకోచం" అని అయ్యంగార్ చమత్కరించాడట.

న్యాయస్థానాలవలె విద్యాసంస్థలూ రిపార్టీలకు కేంద్రాలే. కుర్రవాళ్లు మాష్టర్లమీద, మాష్టర్లు కుర్రవాళ్లమీద విసిరే దెబ్బలను గురించి ఎన్నో కథలు వింటూవుంటాము. ఒక ఇంగ్లీషుమాష్టరు పాఠం అప్పగించని కుర్రవాడిని బెత్తంతో నిలవేసి "ఈ బెత్తం చివర ఒక ఫూల్ వున్నాడు" అని అతితెలివి ప్రదర్శించాడట. అమాయకత్వాన్ని నటిస్తూ ఆ కుర్రవాడు "ఏ చివరండీ?" అని ప్రశ్నించాడట. మరొక పంతులు మొద్దబ్బాయిని చూచి "నీ ప్రాయంలో నేను ఇంతకంటె గొట్టులెక్కలను చులాగ్గా చేసేవాడనురా!" అన్నాడట. "కావచ్చు, సార్! మీకు లెక్కలు చెప్పిన పంతులు మరొకరుగా!" అని వాడు వ్రూడవేశాడట. డాక్టర్ రఘుపతి వెంకటరత్నంనాయుడుగారు బందరు నోబుల్ కాలేజీలో కొంతకాలం లెక్చరర్‌గా పనిచేశారు. అప్పుడు నాయుడుగారు హైస్కూల్ క్లాసులకుకూడా పాఠాలు చెప్ప వలసివుండేది. దిద్దిన కాంపోజిషన్ పుస్తకాలను వాపసు చెయ్యడానికి ఒకనాడు వాటిని నాయుడుగారు తీసుకువెడు తున్నారు. అది నలభైమంది క్లాసు; నలభై పుస్తకాల పెద్దపొత్తిక నాయుడుగారి చేతిని క్రుంగదీస్తున్నది. దీన్ని

చూచి ఆక్లాసు కుర్రవాడొకడు అల్లరిగా నవ్వుతూ "మాష్టార్‌గారూ! ఒక గాడిదబరువు పైన పడిందే" అన్నాడట. ఇందుపై నాయుడుగారుకూడా నవ్వుతూనే "అబ్బే! ఒక్క గాడిదబరువు కాదురా! నలభై గాడిదల బరువు" అని జవాబిచ్చారట.

క్లాస్‌రూమ్‌కు సంబంధించింది కాకపోయినా, ఇటువంటిదే శ్రీ చెరుకువాడ వెంకటనరసింహంపంతులుగారి రిపార్టీ నేను స్వయంగా విన్నదొకటి వున్నది. "ఆంధ్ర వాచాల". "ఆంధ్ర భీమాడిండిమ"—ఇత్యాది బిరుదావళిని సంపాదించుకొనకముందు పంతులుగారు కొన్నేళ్లపాటు కవుతరం (కృష్ణాజిల్లా)లో బడిపంతులుగా పనిచేశారు. అప్పటిలో తమవద్ద చదువుకున్న ఒక శిష్యునియింట పంతులుగారు ఒక పూట బసచెయ్యడం తటస్థించింది. అతడు బహు దుడుకు మనిషి. బడిలోనే పంతులుగారికి యెదురు తిరిగినవాడు. పిమ్మట లోకవ్యవహారాలలోనూ యెడ్డెమంటే తెడ్డెమన్నవాడు. శిష్యునియింట పంతులుగారు స్నాన సంధ్యాదులు పూర్తిచేసుకునేసరికి అతడు బొట్టుపెట్టె తెచ్చి ముంగిటపెట్టాడు. బొట్టుపెట్టుకునే రివాజు పంతులుగారికి లేదు. అయినా, నాము, తిరుచూర్ణం ఎదట కనబడేసరికి నామాలు పెట్టుకుందామన్న సరదా పుట్టింది. శిష్యుడు కాసేపు కనురెప్ప వాల్చకుండా చూచి, "అలవాటు లేక పోయినా తీర్చిదిద్దినట్టు పంతులుగారు పంగనామాలు పెట్టు కుంటున్నారే!" అని నవ్వాడు. "ఈభాగ్యానికి అలవాటు

కావాలటరా? శిష్యులు పెట్టినవాటి ఆనవాళ్లులేవూ?" అని పంతులుగారు అతడినోటికి తాళంవేశారు.

కవులు కుశాగ్రబుద్ధులైనందున, పండితులు ప్రజ్ఞానిధులైనందున, కవిపండితులు రిపార్టీలో ఆరితేరినవారే. డాక్టర్ జాన్సన్ ఒక మిత్రునితో చాలాసేపు వాదించినమీదట అతడు "మీరెంత వాదించినా మీరు చెప్పే విషయాన్ని నేను అంగీకరించలేను" అన్నాడట. "నిజమే లెండి! నేను మీకు వాదం చెప్పగలను గాని, దాన్ని అర్థంచేసుకోగల బుద్ధి నివ్వగలనా?" అని మాటకారి జాన్సన్ ప్రత్యర్థిని చిత్తుచేశాడట. మాటకారితనంలో జాన్సన్ తలదన్నినవాడు బెర్నార్డ్ షా. ఒకనాడు నాటకప్రదర్శనం పూర్తికాగానే నాటకకర్త స్టేజిమీదికి రావాలని ప్రేక్షకులు పట్టుదల చూపగా బెర్నార్డ్‌షా రంగస్థలంపైకి వెళ్ళాడట. వెంటనే ప్రేక్షకుల కరతాళధ్వనులతో నాటకశాల దద్దరిల్లిపోయిందట. "ఊరందరిదీ ఒకదారి, ఉలిపికట్టది ఒకదారి" అన్నట్లు ప్రేక్షకులలో ఒక్కడెవ్వడో "బూ" అంటూ షాను వెక్కిరించాడట. (ఇతడు తెలుగువాడైతే "ఆఛ్" అని దొంగతుమ్ము తుమ్మేవాడు) అతడి "బూ" పూర్తికాక ముందే "బూ" అంటూ షా తానూ అందుకుని "నిజమే నయ్యా! నీతో నే నేకీభవిస్తున్నాను. కాని, ఇంతమంది మాటముందు నీమాటా, నామాటా ఏమి చెల్లుతుంది?" అని మాడుపగలగొట్టాడు. రిపార్టీలకు షా మొనగాడైనా ఆయన ఇతరులచేతిలో దెబ్బతిన్న సందర్భాలుకూడా కొన్ని

వున్నాయి. దెబ్బతియ్యడానికి వురికేవాడు దెబ్బతినవలసి రావడంలో అబ్బురమేమీ లేదు. శాకాహారికనుక విందు భోజనాలకు పిలిస్తే బెర్నార్డ్‌షా నూటికీ, కోటికీ తప్ప వెళ్ళేవాడుకాడు. "చచ్చిన గొడ్లను పీక్కుతినే మీ మధ్యకు నే నెలావస్తాను?" అని విందు ఆహ్వానాలను తిరగగొట్టి వేస్తుండేవాడు. లేడీ ఆక్స్‌ఫర్డ్ కాబోలు ఒకనాడు విందుకు పిలవగా ఒక పోస్టుకార్డుమీద—బెర్నార్డ్ షా మన గాంధీజీ వలె ఉత్తరప్రత్యుత్తరాలకు కార్డులనే ఎక్కువగా వాడు తుండేవాడు—"నా ఆహారనియమాలు జగత్ప్రసిద్ధమై వుండగా, ఈవిధంగా మీరు నన్ను అవమానించడానికి నే నేమి పాపంచేసుకున్నానో ఊహించలేకున్నాను" అని షా బదులు వ్రాశాడట. దీన్ని చూచుకోగానే, ఆమె టెలిగ్రామ్‌ఫారం అందుకుని "మీ ఆహారనియమాలు నాకు తెలియవుగాని, అవి మీ మర్యాదమన్ననలంతటి నికృష్టమైనవి కావనే ఆశిస్తున్నాను" అని బదులు తీర్చింది. ఇంత గట్టి దెబ్బనే బెర్నార్డ్‌షా ఒక పెద్ద ఆర్టిస్ట్ చేతిలో—సి. ఆర్. డబ్లియు. నెవిన్‌సన్ అని జ్ఞాపకం—తిన్నాడు. చిత్రకారులు తమ చిత్రాలకు విపరీతపు వెలలు పెడతారనీ, అందువల్లనే వాటిని కొనేవా రుండరనీ, అందరికీ అందుబాటులోవుండగల ధరలకు బొమ్మలను అమ్మనంతవరకు ఆర్టిస్టులకు "అమ్మా బువ్వా, అయ్యా బువ్వ" తప్పదని షా నమ్మకం. ఇది వాదప్రతివాదాలకు దారితీసిన సందర్భంలో షావి పాతకాలపుమాటలని ప్రతిపక్షి మొగతాళి

చేశాడు. "నేనా పాతకాలపువాడను! నా సరసను ఈ ప్రబుద్ధుడు వీధిని నడిస్తే, ఇతడు తాతగాను, నేను మన మడుగాను లోకం భ్రమపడుతుంది" అని షా తనను సమర్థించుకో బోయాడు. "అందుకు సందేహమా! షా వాదం అంత పసితనంగానూ వున్నది" అని నెవిన్‌సన్ గుక్క తిరగని దెబ్బకొట్టాడు.

మన దేశం కవిపండితులలో రిపార్టీకి వేలుమడచి ముందుగా చెప్పగావలసినవారు, ఒకరు, కృష్ణదేవరాయల ఆస్థానంలోని తెనాలి రామకృష్ణకవి; రెండవవారు, అక్బర్ పాదుషా దర్బార్‌లోని బీర్‌బల్. హంపీ, ఢిల్లీలలోనే కాకుండా ప్రతి రాజాస్థానంలోనూ పూర్వం విదూషకు లుండే వారు. వీరి పని రాజును నవ్వించడమైనా వీరు డొక్కశుద్ధి లేనివారు కారు. వాక్చాతురితో పాటు బహుభాషా పాండిత్యం, వివిధశాస్త్రాలలో ప్రవేశం, విశేషలోకానుభవం లేక పోతే వీరికి రాణింపే వుండేదికాదు. ఒక్కొక్కప్పుడు వీరు అజ్ఞానాన్ని ప్రదర్శించినా, ఆకతాయతనంగా ప్రవర్తించినా, అది తమ ప్రభువుల మెప్పుకోసమేకాని మూర్ఖత్వంవల్ల కాదు. నేర్పుగా అనగలిగితే చివరికి రాజులనైనా ఎంత మాటపడితే అంతమాట అనడానికి వీరికి స్వేచ్ఛా స్వాతంత్ర్యా లుండేవి. అయినా, బహుళ ప్రచారంలోగల రామలింగం, బీర్‌బల్ రిపార్టీలు తప్ప రాజాస్థానాల ఛలోక్తులు మనవరకు రాలేదు. రాజాస్థానాలకు సంబంధించి నేను విన్న రెండు, మూడు రిపార్టీలు విదేశాలకు చెందినవే.

వెనకటికి ఒక బ్రిటిష్ యువరాజు తనకు సుపరిచితుడైన టవర్స్, పోర్ట్స్‌మౌత్‌లో యెదురుపడేసరికి "హలో టవర్స్! పోర్ట్స్‌మౌత్‌లో నిన్ను మించిన బటాచోర్ లేడంటారు, నిజమేనా?" అని పలకరించాడట. అందుపై టవర్స్ అతి వినయంగా వంగి "దేవరవారు నా ఖ్యాతిని అపహరించ డానికి ఇక్కడికి దయచెయ్యలేదుగదా?" అని పట్లికొట్టిం చాడట. విల్క్స్ అనే మరొకడు "గాడ్ సేవ్ ది కింగ్" అని పాడుతుండగా ఈ యువరాజే "అయితే, ఎంతకాలంగా పాడుతున్నావోయి ఈ పాటను?" అని ప్రశ్నించాడట. ఇందుకు విల్క్స్ జవాబు: "ప్రభువులవారి పరిచయభాగ్యం అబ్బిననాటినుంచీ" అని.

అన్నింటిలోకంటె ఎక్కువలబ్జు చాలా పాతదైన అగస్టస్ చక్రవర్తి కథలోనే వున్నదని చెప్పాలి. ఈ రోమన్ చక్రవర్తి పర్యటనకై బయల్దేరగా అచ్చంగా తననే పోలినవాడొకడు కన్పించాడట. కన్పించడమే తడవుగా చక్రవర్తులకు సహజమైన పరమహంకారంతో "మీ అమ్మ యెన్నడైనా రోం నగరంలో వున్నదట్రా?" అని పృచ్ఛ చేశాడట. చక్రవర్తే కానివ్వండి, అతడి అబ్బే కానివ్వండి, మానంపోయినతర్వాత ప్రాణం దేనికన్న తెగింపుతో ఆ వ్యక్తి "మా అమ్మ రోం నగరాన్ని ఎన్నడూ తొంగైనా చూడలేదుగాని, మా నాన్నమాత్రం అక్కడ చాలాకాలం వున్నా"డని జవాబిచ్చాడట.

అగస్టస్‌కు బుద్ధి చెప్పిన రిపార్టీ దాన్ని విసిరిన సాహసిని కారతకు పంపిందేమో మనకు తెలియదు కాని, లార్డ్ హాలిఫాక్స్ (ఇర్విన్ అవతారంలో ఈయన మన దేశంలో కొంతకాలం బ్రిటిష్ వైస్రాయి) విసిరిన రిపార్టీ ఆయనను కామన్సుకు పంపగలిగింది. కామన్స్ సభ పూర్తి పేరు "హౌస్ ఆఫ్ కామన్స్." ముక్తసరిగా దాన్ని "హౌస్" అనడం కూడా కద్దు. "హౌస్" అంటే సామాన్యార్థం— ఇల్లు. కామన్సుకు తొలిగా పోటీ చేసినప్పుడు హాలిఫాక్స్ బహు పిన్నవాడు. తెల్లవారితే ఎన్నికలనగా తన నియోజక వర్గంలో ఆయన కడసారి సభలో ప్రసంగిస్తున్నాడు. అప్పుడు దూరంనుంచి ఎవరోగాని "హౌస్‌నుంచి వస్తూ మీ అమ్మకు చెప్పివచ్చావా?" అని ప్రశ్నించారు. "ఇంకా తల్లిదండ్రుల చాటున బ్రతకవలసిన కుర్రసన్నాసివి నువ్వు" అన్న ఎగతాళి ఈ ప్రశ్నలో వున్నదని నేను వివరించ నక్కర లేదనుకుంటాను. హఠాత్తుగా తనను ఎగతాళి చేయడం జరిగినా, హాలిపాక్స్ తెల్లముఖం వెయ్యలేదు. "ఇప్పుడు నేను హౌస్‌నుంచి రావడం మా అమ్మకు తెలియదు గాని, రేపు హౌస్‌లో అడుగు పెట్టడం మాత్రం తప్పక వింటుంది" అని గడసరి జవాబిచ్చాడు. ఈ జవాబులో మొదటి "హౌస్" యింటికి వర్తించగా, రెండవది కామన్సుకు వర్తిస్తుంది. దీన్ని గ్రహించి సభ్యులందరు హర్షించారు. హాలిఫాక్స్‌ను ఎన్నికలో గెలిపించారు. అయితే, వారికి రెండు విషయాలు తెలియవు. సభలో హాలిఫాక్స్‌ను

ఎగతాళి చేసినవాడు వాళ్ల బట్లర్; అతడు వేసిన ప్రశ్న
దాని కివ్వబడిన ప్రత్యుత్తరం యింటిలో పలుమార్లు రి
ర్సల్ జరిగినట్టిది. హాలిఫాక్స విషయంలో ఈ యె
పారినా, అందరికీ ఇంత అదృష్టం పట్టక పోవచ్చు. ఆక్స్ఫ
యూనియన్ ప్రెసిడెంట్‌గా వుంటున్న రోజులలో ఫిలి
గ్వెడల్లా—చరిత్ర, ముఖ్యంగా జీవిత చరిత్ర, వ్రాయడంల
ఈయన చెయ్యి తిరిగినవాడు—తన మిత్రు డొకని
సభలో తనకు రెండు అడ్డదిడ్డం ప్రశ్నలు వెయ్యవలసింది
నియోగించాడు. మొదటి ప్రశ్నకు గ్వెడల్లా చెప్పిన జవాబు
సభ ఘొల్లుమన్నది. రెండవ జవాబుకు ఇంటి కప్పె ఎగి
పోయింది. హాస్యధ్వనులు కాస్త తగ్గినవో, లేదో
ఆ మిత్రుడికి పురుగు తొలిచి, ఈసారి గంభీరంగా లేచి
ఇలా అడిగాడు: "అయితే, నువ్వు వేయనున్న మూడ
ప్రశ్న ఏమిటి?—గుర్తు రావడం లేదు."





# ము ది మి

"ఏరి కోరి వయస్సు మళ్లినవారినే మీ మంత్రివర్గంలో చేర్చుకొంటున్నా రేమి?" అని ఇండియా ప్రధానిని న్యూఢిల్లీలో పత్రికావిలేకరులు సూటిప్రశ్న వేశారు. "ఎంత ప్రాయం వస్తే వయస్సు మళ్ళినట్టు?" అని ఎదురుప్రశ్న వేయడానికి వీలున్నా, పండిట్ నెహ్రూ దాన్ని వెయ్యలేదు. అయినా, ఇది మనం ఆలోచించ దగిన ప్రశ్నే.

పొద్దు ఎప్పుడు మళ్లుతుంది? నడినెత్తికి వచ్చినమీదట పడమటికి ఏపాటి వాలినా పొద్దు మళ్లినట్టే. ఇదేవిధంగా నడివయస్సు ఏమాత్రం దాటినా వయస్సు మళ్లినట్టే. అయితే, ఏది నడివయస్సు అనేది ఆయా దేశాలనుబట్టి, ఆయా కాలాలనుబట్టి మారుతూవుంటుంది. క్రైస్తవ సంప్ర దాయంప్రకారం మానవుడి ఆయుర్దాయం "మూడు యిర

వైలపైన ఒక పది". ఇక, హిందువుల సంప్రదాయం ప్రకారం మానవుడు శతజీవి. మన దీవనే "శతాయుస్సు" అని. ఒకప్పుడు క్రైస్తవదేశాలలో సగటు ఆయుఃపరిమాణం తక్కువై, మనదేశంలో ఎక్కువ కావడంవల్లనే వారికి ఆ సంప్రదాయం ఏర్పడగా, మన కిది స్థిరపడివుండాలి. కాని, ఇప్పుడు పరిస్థితులు పూర్తిగా తలక్రిందులై పోయాయి. మూడు యిరవైలపై పది సంవత్సరాలు మాత్రమే కాక, నాలుగు యిరవైలపై పదేళ్ళపాటు కూడా యూరప్, అమెరికాలలో ప్రస్తుతం పెక్కుమంది జీవిస్తున్నారు. మన దేశంలో చాలామందికి నూరులో సగమైనా గడవకముందే నూరేళ్లూ నిండుతున్నవి. సగటు ఆయుర్దాయంలోని ప్రస్తుతపు ఈ భేదంవల్లనే యూరప్, అమెరికాలలో షష్టిపూర్తి తర్వాతకూడా పెక్కుమంది తమకు వయస్సు మళ్ళనట్టే భావిస్తున్నారు. కాగా, మనదేశంలో నలభై దాటితే చాలు "ఆ! ఇంక మా దేమున్నది! మా రోజులు వెళ్ళిపోయాయి" అని మునలిముక్కులు ముక్కుతున్న వా రెందరు లేరు? యాభై వెళ్లి, అరవయ్యో పడిలో పడితే చాలు "కాటికి ఒక కాలు పారజాపి కూర్చున్నాము. ఈ ఘటాలు శాశ్వతాలా!" అని మెట్టవేదాంతం మొదలౌతుంది. అయితే, సిసిరో అన్నట్టు, కాటికి రెండుకాళ్లూ పారజాపినవారికైనా ఇంకొక్క ఏడాది బ్రతకక పోతామా అనే ఆశ ఏ మూలనో ఒకమూల కొంత దాగేవుంటుంది.

నేటి పాశ్చాత్యదేశాల పరిస్థితుల దృష్ట్యాకాక, మన దేశంలోని సగటు ఆయుఃపరిమాణాన్నిబట్టి చూస్తే, మన ప్రధాని ఏరి కోరి తన మంత్రివర్గంలో చేర్చుకొంటున్నవారే కాక, ఆయనా వయస్సు మళ్లినవాడే. అయితే, వయస్సు మళ్ళినంతమాత్రాన బుద్ధితీక్ష్ణత మందగిస్తుందా? శక్తి సామర్థ్యాలు సన్నగిలిపోగలవా? మరీ వయస్సు పండిన తర్వాత బుద్ధితీక్ష్ణత మందగించడమే కాక, మతిచాంచల్యమే కలగడంకద్దు. శక్తి సామర్థ్యాలు సన్నగిలడమే కాక, అవి చప్పగా ఉడిగిపోయి, కూర్చుంటే లేవలేని స్థితిలో పడిపోవడంకూడా కద్దు. అయితే, ప్రతివారి విషయంలోను ఇది జరగదు. బెర్నార్డ్ షాకు తొంభై దాటిన పిమ్మటనైనా మానసికపటుత్వం తగ్గలేదు. "హరీ" అనేవరకు ఆయన క్రొత్త క్రొత్త రచనలు చేస్తూనేపోయాడు; కొత్తకొత్త చెణుకులు చెణుకుతూనే పోయాడు. కాని, బెర్నార్డ్ షాను పోలిన వారు బహు అరుదు. ఏమైనా ప్రస్తుత ప్రసంగవిషయం వయస్సు పండినవారి మాట కాదు; వయస్సు మళ్లినవారి మాట.

తక్కినవారి నమ్మకం ఏదైనప్పటికీ హిట్లర్ మాత్రం వయస్సుమళ్లితే, బుద్ధిబలం క్షీణిస్తుందని, శక్తిసామర్థ్యాలు సడలిపోగలవని గట్టిగా నమ్మినవాడే. 1939 లో యుద్ధ ప్రారంభానికి అతడు తొందరపడ్డానికి ఆ నమ్మకమే బలీయ కారణం. అప్పటి కతని వయస్సు యాభై సంవత్సరాలు.

తన లక్ష్యసాధనకు యుద్ధం తప్పదంటే, మరొక అయిదు సంవత్సరాలో, పది సంవత్సరాలో వేచివుండడంకంటె, దాన్ని వెంటనే ప్రారంభించడంవల్ల విజయం పొందగల అవకాశాలు తనకు ఎక్కువగా వుండగలవని అతడు ఒక సందర్భంలో చెప్పడమూ జరిగింది. అయినా, హిట్లర్‌ను యుద్ధంలో వోడించిన ముగ్గురు ముఖ్యులు — స్టాలిన్, చర్చిల్, రూజ్‌వెల్టులు ముగ్గురు—అతనికంటె వయస్సులో పెద్దవారే.

అరవయ్యో పడిలో పడితేనే తన విజయావకాశాలు సన్నగిలిపోగలవని హిట్లర్ భయపడగా తన 83 వ ఏట గ్లాడ్‌స్టన్ బ్రిటన్ ప్రధాన మంత్రిపదవిని నిస్సంకోచంగా స్వీకరించాడు. తర్వాత రెండేళ్లకు ఆయన విరమించినా మనస్ఫూర్తిగా కాదు. పదవిని పరిత్యజిస్తూ "అమ్మయ్య! ఎన్నాళ్లకెన్నాళ్లకు కాస్త విశ్రాంతి" అన్నట్టు ఆయన పోజ్‌పెట్టాడనుకోండి. వయస్సు పండిపోయింది, మరి తప్పుకుంటాననడానికి వోపిక చప్పగా వుడిగిపోలేదట. చెమిటి మేళమనడానికి, కాస్త బిగ్గరగా మాట్లాడితే ఇంకా మాట వినబడుతూనే వున్నదట. కాగా, కంటిచూపు బొత్తిగా మందగించినందునే ఆ వంక చెప్పి తాను ప్రజాహిత జీవనం నుంచి తప్పుకోడానికి వీలు చిక్కిందట. ఈ మాటలను గ్లాడ్‌స్టన్ తన డైరీలో వ్రాసుకున్నాడు. అయినా, తర్వాత కొద్దిరోజులకే ఒక మిత్రుడు "అదృష్టవంతులు—ఇప్పటి

క్తైనా కాస్త విశ్రాంతికి నోచుకున్నారు" అనేసరికి "అదృష్టమూ, నాపాడె! మెడపట్టి నన్ను గెంటివేశారు" అని ముసలివాడు కస్సుమన్నాడు! ప్రసిద్ధుడైన మరొక బ్రిటిష్ ప్రధాని పామర్‌స్టన్‌కూడా ఈ సందర్భంలో యెన్నదగువాడే. ఆయన మరి పదేళ్లకు పోతాడనగానే ఆయనను గురించి "ఈ ముసలితొక్క ఇంకా తాను పదహారేళ్ల బాలాకుమారుణ్ణి అన్నట్టు నటనచేస్తున్నాడయ్యా!" అనే ధోరణిలో డిజెరలీ మహా కటువుగా విమర్శించాడు. అయినా, జవసత్వాలను గాని, ధైర్యసాహసాలను గాని, పేరుప్రఖ్యాతులను గాని కోల్పోకుండా చివరివరకు గడిపి, యెనభయ్యోయేట ప్రధానిగానే పామర్‌స్టన్ తనువు చాలించాడు. ఆయనపై అక్కసం వెళ్లబోసిన డిజెరలీయే 1878 లో "పడుచుతనం పోయినతర్వాతగాని నాకు పదవి రాలేదు" అని వాపోయాడు. "నేను అడుగుతీసి అడుగుపెడితే సింహాసనాలు, సామ్రాజ్యాలు చంచలించిపోగలవనుకున్న రోజులుండేవి. ఇప్పుడవి పోయినవి" అని నిట్టూర్చాడు. చర్చిల్ ఈ నాడు వంతుపెట్టుకొంటున్నది డిజెరలీతో కాదు, గ్లాడ్‌స్టన్‌తోను, పామర్‌స్టన్‌తోను. వారితో తనను పోల్చుకునే, ఇంకా యెనభై నిండని తాను తిరిగి ప్రధానమంత్రిని ఎందుకు కారాదని ఆయన ప్రశ్న; కాగలనని ఆయన భరోసా.

పామర్‌స్టన్ విషయంలోవలె మన గాంధీజీ విషయంలో కూడా వయస్సు మళ్ళినా—వృద్ధాప్యమే వచ్చినా—బుద్ధి

బలం, కార్యదక్షత తగ్గవలసిన అగత్యం లేనేలేదని, పై పెచ్చు శక్తిదీప్తులు అంతకంతకు పెరగడంకూడా సంభవ మని రుజువు అవుతున్నది. మహాత్ముడు భారత రాజకీయ రంగంలో నాయకత్వం స్వీకరించి, సహాయనిరాకరణోద్యమాన్ని ప్రారంభించింది యాభయ్యో యేట; దానికంటె విస్తృతమైన ఉప్పు సత్యాగ్రహాన్ని నడిపింది అరవయ్యో యేట; తన జీవితంలోనే అపూర్వమైన "క్విట్ ఇండియా" మహోద్యమాన్ని కొనసాగించింది డెబ్భయ్యో యేట: ఇక, మతవిద్వేష నిర్మూలనకై ఆత్మార్పణ చేసి, ఏసుక్రీస్తు, గౌతమబుద్ధుల సరసను స్థానాన్ని పొందింది దాదాపు యెనభై చేరొంటుండగా!

వయస్సు మళ్ళడానికి, మానసికాది పాటవాలకు సంబంధం తక్కువని మహామహుల జీవితాలు అనేకం నిరూపిస్తున్నా, ప్రతివారి విషయంలోను ఇదే సత్యమనడానికి వీలులేదు. ఎనభై యేళ్లు నిండవస్తుండగా కొత్తకొత్త ఫక్కీలలో కవిత్వం వ్రాయడం ఏ ఒక్క టాగూర్‌కో చెల్లింది; ఎనభై యేళ్లు నిండిన వెనక కొత్త భాషను నేర్చుకోడానికి ఉద్యమించడం ఏ ఒక్క కాటోకో (ఈయన క్రీస్తుకు పూర్వం రెండు శతాబ్దాలనాటి రోమన్ రాజకీయవేత్త) చెల్లింది. తక్కిన సామాన్యుల విషయంలో "అరవై యేండ్లయినవి; చదువుకోకుండా మొత్తుకుంటానా?" అనే సామెతలోని ఎత్తి పొడుపు అక్షరాలా నిజమే అవుతుంది.

వయస్సు మీరినకొద్దీ తెలివిమీరేవారు కొందరు కాగా, ఒక వయస్సు వచ్చేసరికి గిడసపారేవారు కొందరు. ఒక్కొక్క యేడు పైబడినకొద్దీ కళలు తగ్గేవారూ కొంద రుంటారు. ప్రాయంలో పెద్దతనాన్నిబట్టి బుద్ధిలో పెద్ద అని విధిగా అనుకోడానికి వీలులేదు. ఇక, ప్రాయంలో పిన్నతనాన్నిబట్టి బుద్ధికికూడా తప్పనిసరిగా బుడత అనుకో వడమూ పొరపాటే. కౌరవసభలో ద్రౌపదిని ఘోరావ మానానికి పాల్పడజేస్తుండగా కురువృద్ధులు సయితం చూప లేకపోయిన ధర్మజిజ్ఞాసను, న్యాయపక్షపాతాన్ని పసివాడు వికర్ణుడు చూపగలిగాడు. "ఎవ్వరుం బలుకకున్న నే నిందు ధర్మనిర్ణయంబు సేసెద" అని అతడు ధైర్యంగా ఆ నిండోల గంలో నిలబడ్డాడు. "జూదంబును, వేటయు, పానంబును, బహుభక్షణాసక్తియు నను నాలుగు దుర్వ్యసనంబులం దగిలిన పురుషుండు ధర్మువుం దప్పి వర్తిల్లు; నట్టి వాని కృత్యంబులు సేకొనందగవు. కితవాహూతుండై, వ్యసన వర్తియయి, పరాజితుండయిన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణ ధనంబయిన పాంచాలిఁ బణంబుజేసెం గావున, ద్రౌపది యధర్మవిజిత. అక్కోమలి, యేక వస్త్ర, నిట దోడ్కొని తెచ్చుట యన్యాయంబు" అని కేవలం ధర్మదేవతవలె తెగవేసి చెప్పాడు. పెద్దలే మిన్న కుండగా పిన్నవాడు ఇంత నిర్భీకంగా ధర్మనిర్ణయం చేయ డానికి కినిసి, "ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు బేల నీకుఁ

జెప్పనేల వలసెఁ? జిరుతవాని కింత తఱుసంటిపలుకులు సన్నివృద్ధజనము లున్నచోట!'' అని కర్ణుడు తన కొమరుని మందలించి వుండవచ్చు. తండ్రిచే ఈవిధంగా తిరస్కృతుడైనా వికర్ణుడు కలకాలానికి జనవంద్యుడే అయినాడు. తండ్రిచే తిరస్కృతుడైన ప్రహ్లాదునికి సయితం ఇంతటి శాశ్వత సత్కీర్తి దక్కింది. ఇంతకీ చెప్పవచ్చిం దొక్కటే. వయఃపరిమితికీ, బుద్ధిపరిణతికీ స్థిరమైన సంబంధ మేమీ లేదు.

అయితే, ఒక్కొక్క వయస్సులో ఒక్కొక్కరంగంలో విశేషంగా రాణించడానికి విశేషావకాశాలు కలవని చెప్పవచ్చునేమో! ఉదాహరణకు, ఈడు ముదిరినతర్వాత కవిగా రాణించడం కష్టం. యౌవనం గడచినపిమ్మట కవిత్వాన్ని చెప్ప నారంభించి, కీర్తికెక్కినవారు మచ్చుకైనా లేరనడానికి వీలులేదనుకోండి. కాని, ప్రసిద్ధ కవులలో పెక్కుమంది కవితను నవయౌవనంలో ప్రారంభించినవారే. వీరిలో కొందరు బాల్యంలోనే కవితాధోరణిలో పడ్డారు. పోప్ తాను చిట్టిపొట్టి మాటలతోపాటే పద్యాలల్లడం ప్రారంభించినట్టు చెప్పుకున్నాడు. రవీంద్రనాథ్ టాగోర్ కూడా అయిదవయేటనో, ఆరవయేటనో తన తొలిపద్యాన్ని వ్రాశాడట. బడిపంతు లిచ్చిన లెక్కలను చెయ్యలేక గిజగిజ తన్నుకుంటూ, వాటిని ఒక పక్కకు నెట్టివేసి, కొన్ని వందల పంక్తుల పద్యాన్ని శ్రీమతి సరోజినీదేవి

అల్లిందట. పూర్వాంధ్రకవులలో శ్రీనాథుడు "చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాడు రచియించితిని మరుత్తరాట్ చరిత్ర" అనీ, "నూనూగు మీసాల నూత్న యౌవనమున శాలివాహన సప్తశతి నోడివితి" అని చెప్పుకున్నాడు. ఇప్పు డేమి, ఇదివరలో నేమి, ఇకముం దేమి బాలకవులసంఖ్య అధికమే. బాలకవులమని చెప్పుకునేవా రందరు "బాలా కుమారులు" కారనుకోండి. వారిలో కొందరు గడ్డాలవారు, మీసాలవారు వుంటా రనుకోండి. అయినా, కవిత్వం పెల్లుబకడం సర్వసాధారణంగా బాల్యంలో జరుగుతుంది కనుకనే, బాలకవుల సంఖ్య విస్తారమని మాత్రం అంగీక రించాలి.

షెల్లీ, కీట్స్, బైరన్ : ఈ ముగ్గురు ఇంగ్లీషు కవిశేఖ రులు నలభై యేండ్ల లోపునే చిరకీర్తిని గడించడం, కథావ శేషులుకావడం — అంతా జరిగిపోయింది. మరీ కీట్స్ ముప్పై నిండకముందే మృత్యుముఖాన పడిపోయాడు.

ముప్పైకి ముందుగా కవి కానివాడు ఆతర్వాత కవి కావడం నూటికో, కోటికో తప్ప కానరానట్లే, ముప్పైకి ముందు నాటకకర్తలుగా రాణించినవారు కూడా బహు అరుదు. కవితారాధనకు హృదయనైర్మల్యం, కోమలత్వం, ఉద్విగ్నత మొదలైన లక్షణాలు కావాలి. ఇక, నాటక రచనకు విశేషంగా కావలసినట్టిది లోకానుభవం. కనీసం ముప్పై సంవత్సరాలైనా గడవనిదే జీవితాన్ని తిన్నగా

చవిచూడ్డమేమి, లోకం పోకడలను గ్రహించడమేమి సామాన్యంగా జరగదు. ప్రపంచప్రసిద్ధులైన నాటక కర్తల జీవితాలను పరిశీలించగా వారు ముప్ఫై నిండక ముందే నాటకరచనకు ఒకవేళ దొరకొన్నా, ముప్ఫై నిండిన తర్వాతనే కాని రాణింపుకు రానట్టు కానవస్తుంది. నిర్ధారణగా చెప్పడానికి ఆధారాలు లేకపోయినా, షేక్స్పియర్ నాటకరచనకు తొలి ప్రయత్నాలను చేసింది ఇరవై యేడవ యేడు చేకొనబోతుండగా. కాని, నాటక రచనలో ఆయనకు కొంత చెయ్యి తిరిగింది ముప్ఫై ప్రవేశించిన వెనకనే, "హామ్లెట్", "ఒథెల్లో", "మెక్బెత్" మొదలైన తన మహానాటకాలను — విషాదాంత నాటకాలను — ఆయన వ్రాయగలిగింది నలభై ప్రాంతాలలోనే. ఇక ప్రౌఢిమకు, పరిపక్వతకు, గాంభీర్యానికి, లాలిత్యానికి ఆయన నాటకాలలో ప్రత్యేకంగా యెన్నవలసిన "టెంపెస్ట్" రచన జరిగింది ఆయన యాభై హద్దును చేరుతుండగా. మొత్తంపై గ్రీక్ నాటకకర్తల జీవితాలలో కూడా ఈ ఫక్కీయే కనబడుతుంది. నాటకకర్త కాగలిగేసరికి ఈశ్చైలస్ వయస్సు దాదాపు ముప్ఫై సంవత్సరాలు. ఆయన నాటకాలలో అతి ప్రసిద్ధమైనదాని రచన షష్టిపూర్తి చేసుకోనన్న సమయంలో. సోఫోక్లెస్ పాతికేళ్ల ఈడుకే తొలి నాటకం వ్రాసినా, నాటకకర్తల పోటీలో యురిపిడిస్‌ను ఓడించగలిగింది తనకు యాభై యెనిమిదవ

యేడు జొరబడిన పిమ్మటనే. యురిపిడిస్ కూడా పాతికేళ్లకు మొదటి నాటకం వ్రాసినవాడు. అయితే, సమకాలికు లలో జౌననిపించుకోడానికి మరొక పదిహేను సంవత్సరాలు వేచివుండవలసి వచ్చింది. ఆయన తన చిట్టచివరి నాటకం వ్రాసింది డెభ్బై నాల్గవయేట. నవయౌవనంలోనే నాటక కర్తగా జీవితాన్ని ప్రారంభించినా, అరిస్టోఫేన్స్ లోకం మెప్పుపొందగలిగింది ముప్పై యేండ్లు నిండినవెనకనే. ఇక, ప్రపంచ ప్రసిద్ధ ఫ్రెంచి నాటకకర్త మోలియర్ రాణలోకి వచ్చింది ముప్పైయేడవయేట. ఇబ్సెన్ తొలినాటకం వెలువడింది ఆయన ఇరవైయెనిమిదవయేట. బెర్నార్డ్ షా ఓం ప్రథమంగా నాటకం వ్రాయడం ముప్పై అయిదవ యేట. ఇలాగే మరెందరెందరి వృత్తాంతాలనో చెప్పవచ్చు గాని, మరి ఇట్టి దృష్టాంతాలతో పని లేదు. ప్రసిద్ధ నాటక కర్తలలో బాల్యంలోనే యెన్నదగు రచనలు కొనసాగించిన వారు షిల్లర్‌వలె ఏ వొక్కరో, యిద్దరో!

వయస్సు ముదిరితే తప్ప, లోకానుభవంలో పండితే తప్ప, నాటకరచనలో రాణించడం దుస్తరమనేది మన పూర్వులు స్పష్టంగా గుర్తించిన విషయమే. "నాటకాన్తం కవిత్వమ్" అని, "నాటకాన్తం హి సాహిత్యమ్" అని వారు ప్రక టించిన సూత్రాల సారాంశ మిదే. మన మహానాటకకర్త కాళిదాసు ముందు కవిగా భాసించి, ఆ పిమ్మటనే నాటక కర్తగా అమరుడైనట్టు తోస్తుంది.

నాటకకర్తగా రాణించడానికి ముప్పైఏదాటాలంటే, రాజకీయవేత్తగా నెగ్గుకురావడానికి నలభై నిండక తప్పదేమో! నలభై దాటిన తర్వాత ప్రతివాడు "స్కౌండ్రల్" అని బెర్నార్డ్ షా చెప్పాడు. "స్కౌండ్రల్" కానిదే రాజకీయ వేత్తగా రాణించడం—ఔను!—నిజంగా చాలా కష్టమే. పిన్న వయస్సులోనే రాజకీయవేత్తగా విఖ్యాతి నందినవాడు ఇరవై నాల్గవయేట బ్రిటిష్ ప్రధాని కాగలిగిన యంగర్ పిట్ తప్ప మరెవ్వరు లేరేమో!





# పేరు, పెన్నిధి

"పేరులో ఏమి పెన్నిధి వున్నదా?" అని ప్రశ్నించాడు షేక్స్‌పియర్. ఏ పేరుపెట్టి పిలిచినా గులాబి గుబాళించే పరిమళమాధుర్యం తగ్గదు పొమ్మన్నాడు. షేక్స్‌పియర్ భక్తుడైన మిస్టర్ గిరీశం ఇందుకు "డిటో" అన్నాడు. గిరీశం దృష్టిలో ఆదర్శ పురుషు లిద్దరే. సారస్వతానికి సంబంధించినంతవరకు షేక్స్‌పియర్; రాజకీయాల ప్రసక్తి వచ్చేసరికి సురేంద్రనాథ్ బానర్జి. శిష్యుడు వెంకటేశాన్ని ఆప్యాయంగా పిలవాలంటే అతడినోట చప్పున వచ్చే ముక్క: "మై డియర్ షేక్స్‌పియర్". శిష్యుని గొప్పవాడిని చేస్తానన్నప్పుడు గొప్పకు ఆఖరిమెట్టు: సురేంద్రనాథ్. అయితే, మొత్తంపై తన సాహిత్యాచార్యునిపై కంటె, రాజకీయ గురువుపైనే గౌరవం మెండు. రాజకీయాధికారం లేని సోషల్ రిఫారమ్ తాడులేని బొంగరం కాగలదన్న నమ్మకమే సోషల్ రిఫార్మర్ మిస్టర్ యన్. గిరీశానికి

రాజకీయవేత్తపట్ల అధిక భక్తిప్రపత్తు లుండడానికి కారణం కావచ్చు. దీనికేమి గాని, పేరులో పెన్నిధిలేదని షేక్స్పియర్ కంటె గట్టిగా బల్లగుద్ది గిరీశం వాదించాడు. "టు మ్యారీ యె విడో, ఆర్ నాట్ టు మ్యారీ, దటీజ్ ది క్వశ్చన్" అంటూ షేక్స్పియర్ పడిన అవస్థలో పడి, "తొందరపడి హాజీ సాహెబ్ తురకల్లో కలిసిపోయాండన్నట్టు, నావంటి బుద్ధిమంతుడు యేపనీ తొందరపడి చెయ్యకూడదు. దాని లాభనష్టాలు బేరీజువేసి, జమాఖర్చులు చేసుకుని మరీ డిసైడ్ చెయ్యాలి" అనే నిర్ణయానికి వచ్చిన పిమ్మట అతడు తేల్చిన తథ్య మిది: "విడో అంటే ఏమిటి? ఓ పేరు. ఆ పేరు మనిషి మొహంమ్మీద రాశుందా? మనిషిని ముస్తాబుచేసి యెదట నిలబెడితే, యిది పునిస్త్రీ, యిది విడో అని చెప్పదగిన పెద్దమనిషి యెవడు? ఒహడూ లేడుగనక, విడో అనే వస్తువు యెక్కడుందయ్యా? వెక్కిరించే వెధవల నోట్లో వుంది". "విడో" అన్న మాటకు విలువ నివ్వ నక్కరలేదని ఇంత గుమ్మైన వాదంచేసిన గిరీశం "వెక్కిరించే వెధవలు" అనే తిట్టు తిట్టి పుటికిక్కిన పప్పులో కాలువేశాడు.

పేరేదైనా అయ్యేదీ, పొయ్యేదీ లేదని చెప్పేవారందరు నా దృష్టిలో పొరపడుతున్నవారే. ఇతరులమాట చెప్పలేను గాని గులాబిని మరొక పేరుపెట్టి పిలిస్తే, దాని గుబాళింపు నాకు తగ్గితీరుతుంది. గులాబి నెత్తావిలోని మెత్తదనం "గులాబి" అనే మాటలోకూడా వున్నది. పెద్ద మార్పుతో

పనిలేదు—"గు"ను కాస్త వొత్తి "ఘులాబి" అనండి; లేదా, "లా" లాలిత్యాన్ని ఖూనీచేసి, "గుళాబి" అనండి; కాదా, "బి"ని పరుషంచేసి, "గులాభి" అనండి. వెంటనే మీా వొళ్ళు జలదరించదూ? ఈ అపభ్రంశా లన్నింటిని జతచేర్చి "ఘుళాభి" అనండి—పై ప్రాణం పైనే పోదూ? ఇందువల్ల "గులాబిని మరొక పేరుపెట్టి పిలిస్తే..." అనే సమస్య ఉత్పన్నమే కాదు. ఆ పువ్వుకు ఆ పేరే తగు; ఆ పేరుకు ఆ పువ్వే తగు. అది మనకు విలాయితీ పువ్వు. "గులాబి"కి పర్షియన్ రూపం "గుల్ ఆబ్". కొత్త పువ్వుగదా అని మనం దానికి కొత్తపేరు తగిలించివుంటే, అతుకు అతుకుగానే వుండేది. కాబట్టే, అసలుమాటను మరి కాస్త సాధువుచేసుకుని "గులాబి" అన్నాము. గులాబికి ఇతర భాషలలో ఇతర పేర్లు వున్నాయనుకోండి. కాని, అవికూడా ఇంగ్లీషుపేరు "రోజ్" వలె రమ్యమైన పేర్లే కాగలవన డంలో నాకేట్టి సందేహం లేదు.

షేక్స్పియర్ చెప్పనివ్వండి, ఆయనకంటె ఘనుడే చెప్ప నివ్వండి, ఏ పేరైనా ఒక్కటే ననడం అర్థంలేనిమాట. వ్యక్తిత్వానికి పేరు ఒక్కటే పునాది కాకపోవచ్చుగాని, అదికూడా ఒక పునాది. సంఘంనుంచి వ్యక్తిని వేరుచేసేది పేరే. వ్యక్తిత్వం మోసులెత్త నారంభించగానే, అప్పటికి వాడికి మన మొక పేరు పెట్టివుండకపోతే, పసివాడు తనకు తానై నామకరణం చేసుకుంటాడు. "నీ పేరేమిటిరా, అబ్బాయ్?" అని ముద్దుకొద్దీ పలకరిస్తే, "బాబు", "బుజ్జి,"

"సిన్ని"—ఇలాంటి పేరేదో సగర్వంగా చెప్పుకుంటాడు. తర్వాత వాడి కే పేరుపెట్టినా స్వజనానికి సంబంధించినంత వరకు తనకుతానై పెట్టుకున్న తొలిపేరే చెల్లుబాటు కావడంకూడా కద్దు. నేనై పెట్టుకున్నదో, కాదో చెప్పలేను గాని, నా పసితనం పేరు "పాప". ఇప్పటికీ ఆప్త బంధు మిత్రులకు నేను "పాప"నే. పరాకుగా "పాప" అనే పిలుపువింటే నన్నేనేమోనని ఈ నాటికీ వెనక్కితిరిగి చూస్తుంటాను. వ్యక్తిత్వం మారాకైనా తొడగకముందే పేరుతో ఇంతగా పనిపడగా, ఆ తర్వాత తర్వాత అది బ్రతుకుపై ఎంతో ప్రాధాన్యం వహించడం అబ్బురమటండీ!

"పేరుబలం" అనేది ఉత్తమాట కాదు. ఒక్కొక్క పేరు మహాబలంగలదై వుంటుంది. విష్వక్సేనుడు, ధృష్టద్యుమ్నుడు, ధృతరాష్ట్రుడు—ఇట్టి పేర్లు బలమైనవని బడి పంతుళ్ల వెర్రి నమ్మకం. డిక్టేషన్ వ్రాసే బుడతలపై వీటినే వారు బ్రహ్మాస్త్రాలుగా సంధిస్తారు. ఇతరులు కొందరు పేరు ఎంత పొడుగుపాటిదైతే అది అంత బలమైంది కాగలదని భ్రమపడతారు. నా చిన్నతనపు సహాధ్యాయులలో ఒకని పేరు—వెంకట వేణు గోపాలకృష్ణ దుర్గా నాగేశ్వర హరి నారాయణ ప్రసాదరావు. మా కంఠనాళాలకు ముప్పుకలుగుతుందేమోనన్న భయంతో అతని పేరును మేము "ప్రసాద్" అనే మూడక్షరాల మాటకు సంగ్రహపరిచాము. పేరులోని బలం సంఖ్యాశాస్త్రంపైన, జ్యోతిష సూత్రాలపైన ఆధారపడేదికూడా కాదు. అయితే, దాని

బలం ఎక్కువున్నదంటే నిర్ధారణగా చెప్పలేము. కాని, ఒక్కమాటమాత్రం చెప్పవచ్చు. లెనిన్ అసలు పేరు—వ్లాడిమిర్ ఇలియిచ్ యుల్యనాఫ్. ఈ పేరుతో ఆయన జగత్ప్రసిద్ధ పురుషుడు కాగలిగేవాడని నే ననుకోను. ఎంత కొట్టుమిట్టాడినా లెనిన్ పదవిలోకి జోసెఫ్ విస్సారియొనోవిచ్ డిజుగష్విలి రాగలిగేవాడుకాడు; అమ్మాబాబూ పెట్టిన ఈ నోరు తిరగని పేరును స్టాలిన్‌గా మార్చుకున్నందునే లెనిన్ సరసను ఆయన స్థానం సంపాదించుకోగలిగాడు. షికెల్‌గ్రబర్ కావలసిన యోగం కొద్దిలో తప్పినందునే హిట్లర్ చిచ్చరపిడుగు కాగలిగాడు. గాంధిగా బాపూజీ మన హృదయాలపై రాజ్యం చేసినంతగా మోహన్‌దాస్‌గా చెయ్యగలిగేవాడు కాదేమో! అయితే, దీని తాత్పర్యం పొట్టిపేర్లలో ఏదో మహత్తు కలదని కాదు. పొట్టివాడి కడుపులో పుట్టెడు బుద్ధులుండ వచ్చునేమో కాని, పొట్టిపేరులో పుట్టెడు ఖ్యాతి లేదు. రంగడు. సింగడు వగైరా, వగైరా పొట్టిపేర్లవా రెందరు లేరు?

పొట్టివల్లనే పేరుకు బలం రాదుగాని, ప్రసిద్ధనామాలు సర్వసాధారణంగా పొట్టివికావడం మాత్రం గమనార్హం. అసలుపేరు పొడుగుపాటిదైనా దాన్ని లోకం పొట్టిచేసి వెయ్యడం తరచు జరుగుతూవుంటుంది. డేవిడ్ లాయడ్ జార్జి "యల్ యల్. జి." అయిపోయాడు; ఎమ్మాన్ డీవెలరా డేవ్ అయిపోయాడు. విన్‌స్టన్ స్పెన్సర్ చర్చిల్‌లో స్పెన్సర్ మొగిరిపోయి, విన్‌స్టన్ చర్చిల్ మిగిలింది. జార్జి

బెర్నార్డ్ షా "జార్జి" అనే ముక్కపట్ల వెగటుకొద్దీ దాన్ని తనకు తానై కత్తిరించివేసుకున్నాడు. కాని, వెంటనే మరొకవిషయాన్నికూడా జ్ఞప్తికి తెచ్చుకోవాలి. అక్కసం వెళ్ళబోసుకోవాలన్నా, అల్లరిపెట్టాలన్నా పేరును పొట్టి చెయ్యడంకూడా కద్దు. నాగభూషణంపై కడుపుమంట తీర్చుకోవాలంటే, అతడు "నాగ్గాడు" అయిపోతాడు; వీరభద్రరావును అల్లరిపెట్టాలంటే, అతడు "వీరాయ్" అయిపోతాడు.

ఇంతకీ తేలింది—ఎందువల్ల పేరుకు బలంవస్తుందో మనకు కచ్చితంగా తెలియదని. అయినా, పేరుకు బలమనేది వున్నదనడం ఖాయం. అయినా, సంతానానికి నామకరణంలో—అసలే శ్రద్ధ తీసుకోరననుగాని — దూరాలోచన చెయ్యరు. సర్వసాధారణంగా పితామహుని పేరునో, మాతామహుని పేరునో కాలానికి తగినట్టు కొంత సంస్కరణ చేసి తగిలించివేస్తారు. తాత శేషయ్య అయితే, మనమడు శేషగిరిరావు, ఆయన గంగయ్య అయితే, వీడు గంగాధరరావు. (మా తాత వెంకయ్య కాబట్టె నేను వెంకటేశ్వరరావును అయ్యాను). ఆడపిల్లల విషయంలోనూ ఇంతే జరుగుతుంది. అమ్మమ్మ అచ్చమ్మ, మనమరాలువద్దకు వచ్చేసరికి అచ్చమాంబగా నవరూపం ధరిస్తుంది; నాయనమ్మ కమలమ్మ, మనమరాలు కమలాకుమారిగా కొత్త అవతారమెత్తుతుంది. పూర్వీకుల పేర్లను కాకపోతే వారు కలలో కనబడ్డారనో, వీరు సోదెలోకి వచ్చారనో ఏవో పేర్లను

పెడతారు. లేకపోతే, తాము మొక్కుకున్న ఇలవేల్పుల పేర్లు పెడతారు. కొందరైతే నామకరణంలో కేవలం ఏదో ఒక పరమ మూఢవిశ్వాసాన్నే ఊతగొంటారు.

కడుపున పుట్టిన బిడ్డలు బ్రతకకుండా పోతుంటే, కొత్తగా కలిగినవాడికి చెడ్డపేరు పెట్టుకోవాలనేది ఒక మూఢ విశ్వాసం. దానిప్రకారం "అబద్ధాలు" అని పేరు పెట్టా రనుకోండి. తన పేరే అబద్ధాలుకాని, తాను అబద్ధాల కోరును కానని లోకాన్ని నమ్మించడానికి అతడెన్ని తంటాలు పడాలి! మాటలో ఏ కాస్త తబాబు వచ్చినా "వాడి పేరే అబద్ధాలు కాదూ!" అని అతడిని నిరసించడం ఎంత తేలిక! "అబద్ధాలూ! నిజం చెప్పరా!" అంటూ తుంటరివాళ్ళు అతడిని లాగూచొక్కాల ఈడునుంచీ వుడికలించరా? అబద్ధాలనే కాక, అంతకంటె అధ్వాన్నపుపేరు "పెంటయ్య" అనికూడా పెట్టడంకద్దు. పుట్టిన బిడ్డకు పుట్టిన వెంటనే ముఖానికింత పెంట పులిమి, బ్రతికినంతకాలం నువ్వు పెంట ముఖంతోనే బ్రతకమని చెప్పడంతప్ప ఇది మరొకటి కాదు. జన్మతోనే ఒకసారి ఇలాంటి కఠినశిక్ష వేసినతర్వాత ఎంత గింజుకున్నా ఆ వ్యక్తి మరి దానినుంచి తప్పించుకు బయట పడ్డం కష్టం. అయిదో, పదో తాలూకా ఆఫీసులో ముడుపు కట్టుకుని, కావాలంటే పేరు మార్పించుకోవచ్చు ననుకోండి. అయినా, "పిల్లపోయినా పురిటికంపు పోలే"దన్నట్టు పాత దాని వాసన వెన్నంటుతూనే వుంటుంది. చిలుం వదిలించు కుని అబద్ధాలు ఏ రామయ్యో అయ్యాడనుకోండి. తర్వాత

అతడి పరిచయస్థులందరు అతడిని "అబద్ధాల రామయ్య" అనడం ప్రారంభిస్తారు. పెంటయ్య ఇలాగే ఏ సీతయ్య అవతారమో యెత్తగోరితే, అతడు "పెంట సీతయ్య"గా పరిణమిస్తాడు. (ఈ చివరిమాట వర్ణక్రమాన్ని కొద్దిగా మార్చి "పరిమళిస్తాడు" అనాలంటే నాకు అభ్యంతరం లేదు.)

హీనపు పేరు బ్రతుకును వెక్కిరించగా, ఘనపు పేరు దాన్ని క్రుంగదీస్తుంది. "నిజమాడితే నిష్ఠురం" కనుక "దారినిపోయే పెద్దమ్మా! మాయింటికి వచ్చిపో" అన్నట్టు చిక్కులు కొనితెచ్చుకోరాదంటే, అందరితోపాటు హరిశ్చంద్ర నామధేయుడుకూడా తెల్లారి లేస్తే, ఏదో చిన్నబొల్లు, పెద్దబొల్లు ఆడకతప్పదు. ఆడింది అబద్ధమని బయటపడితే మాత్రం తక్కినవారికి అంటే అనృతదోషానికి పదిరెట్లు హరిశ్చంద్ర నామధేయునికి అంటుతుంది. ఇతరు లెవరైనా పిరికికండ చూపితే, అది వారి పుటకతీరు; భీమన్న భయస్థుడైతే మాత్రం అది నవ్వులాటల విషయం. అన్యు లన్యాయం చేస్తే అది తప్పు; దాన్నే ధర్మన్నచేస్తే అది తప్పున్నర.

ఘనమైన పేరు పెట్టడంలోని ఈ ప్రమాదాన్ని కానక పోవడంవల్లనే రామమోహన్‌రాయ్, దయానంద, వివేకానంద, తిలక్‌ల ప్రభ వెలిగిపోతున్న రోజులలో చాలామంది రామమోహన్‌లు, దయానందులు, వివేకానందులు, తిలక్‌లు వెలిసారు; ఇప్పుడు గాంధులు, సుభాస్‌లు, జవహార్‌లు వెలుస్తున్నారు. అన్యరాష్ట్రాలవారైనా, స్వజాతీయులు

కాబట్టి ఈ నాయకులపేర్లు అతకనైనా అతుకుతాయి. కాని, తమకు గౌరవభాజనులైనవా రన్న కారణంచేత, ఎంతమాత్రం అతకని విజాతీయప్రముఖుల పేర్లను పెట్టడం కూడా—అరుదుగానే అనుకోండి—జరుగుతూ వుంటుంది. ఎ. ఒ. హ్యూమ్‌పట్ల భక్తిఫలితంగా వచ్చిన ఇట్టి ఒక పేరు "హ్యూంశాస్త్రి"; జిల్లా జడ్జి మిస్టర్ రాస్‌పట్ల ప్రేమాభిమానాలవల్ల వచ్చిన ఇట్టి మరొకపేరు వెంకట శివరామరాస్.

మోక్షసాధనకు సూక్ష్మోపాయంగా నామకరణ మహోత్సవాన్ని సాగించడమూ కద్దు. భగవంతుని తలచుకున్నా, తలచుకోనకపోయినా, బిడ్డలకు దేవుళ్ళపేర్లు పెట్టుకుని, వారిని ఆ పేర్లతో పిలుస్తుంటే, అలా పిలిచిన ప్రతిసారీ మన ఖాతాకు స్వర్గంలో కొంత పుణ్యం జమపడుతూ వుంటుందట. పరమ పాపిష్ఠిని యమలోకానికి బడబడ లాక్కుపోవడానికి యమదూతలు రాగా, ఊపిరివిడుస్తూ బొడ్డులోని తాళపుచెవుల గుత్తిని అప్పగింతపెట్టడానికి కాబోలు, "నారాయణా!" అంటూ కొడుకును పిలిచి వున్నందున, విష్ణుదూతలు పరుగు పరుగున వచ్చి, యమభటులతో బాహాబాహి, ముష్టాముష్టి, హోరాహోరి యుద్ధం చేసి, అతడిని సరాసరి స్వర్గానికి తీసుకువెళ్లారట. ఇట్టి మూఢ నమ్మకాలతోనే దేశం తగల బడి పోతున్నదని చిత్తశుద్ధి పూర్వకంగా నమ్ముతున్న ఒక నాస్తికవాదనాయకుడు తన సంతానానికి "లవణం", "సమరం", "మైత్రి" మొదలైన పేర్లు పెట్టుకున్నాడు.

"అయితే పప్పు, బియ్యం, మంచం, కంచం, ఇల్లు, వాకిలి మనకు పేర్లు ఎందుకు కారాదు?" అని ఆయనను చాటున వెక్కిరించేవా రున్నారు. నిజమే, ఎందుకు పెట్టుకోరాదు? పెట్టుకుంటూనేవున్నాము కూడా. బియ్యం ఒక మనిషి పేరు కాకపోయినా, దానితోవండే అన్నం ఒక పేరే. మన కొక అన్నమయ్య లేడా? ఇక్కడ నే నుద్దేశిస్తున్నది ప్రఖ్యాత పదకర్త తాళ్లపాక అన్నమాచార్యులను. మంచం ఒక మనిషిపేరు కాదు గాని, ఇల్లు ఒక పేరే. అయితే, ఇటుక, అడుసుతో కట్టిన యిల్లు కాదనుకోండి, పుణ్యాత్ము లైనవారికి శాశ్వతనివాసంగా చెప్పబడే యిల్లు, వైకుంఠం. దానిపై వచ్చినపేరే వైకుంఠరావు. "లవణం" వెక్కిరింత పేరుకావడానికి "లావణ్యావతి" ఉప్పునుంచి వచ్చిన పేరే కాదా? తిక్కే మనకు పూజనీయమైనపేరు కాగా, "మైత్రి" ఎందుకు కాగూడదు? అయితే, పైనచెప్పిన నాస్తికవాద నాయకునిచర్యను సమర్థించడం ఇక్కడ నాపని కాదు. ఆయన పెట్టినపేర్లు విడ్డూరమైనవైతే, ఆయనను చాటు మాటున వెక్కిరించేవారి పేర్లలోనూ విడ్డూరం లేకపోలేదని చూపించడమే నా వుద్దేశం.

ఈవిధంగా అన్నిరకాల పేర్లలోను ఏవో తప్పు లెన్నితే, ఇక ఏవి సరైన పేర్లంటే నేను చెప్పగలిగింది లేదు. నాబిడ్డల పేర్లవిషయంలో నేను ఎంతకీ ఒక నిర్ణయానికి రాలేకపోయి నందునే నా బంధుమిత్రులు వాళ్ళకు నామకరణం చేశారు. బాగా ఊహ వచ్చినతర్వాత వాళ్ళు తమ పేర్లను తామే

నిర్ణయించి పెట్టుకునివ్వుంటే నేను ఎక్కువ సంతోషించేవాడి నేమో! ఈనాటిమాట తెలియదుగాని, ఇదివరలో సోవియెట్ రష్యాలో తల్లిదండ్రులుపెట్టినపేరు బిడ్డకు ఊహ తెలిసే వరకే. ఆతర్వాత ఆ చిన్నది, లేదా ఆ చిన్నవాడు, తను కోరినపేరు పెట్టుకోవచ్చు. మలయాలో అనుకుంటాను, నన్ను పోలిన ఒకగృహస్థు తన బిడ్డలను వారు స్వయంగా నామకరణంచేసుకునేవరకు నంబర్ 1, నంబర్ 2, నంబర్ 3—ఈ వరసను పిలవాలనుకున్నాడటగాని, ఆడవాళ్ళు అతడి ఆలోచన సాగనివ్వలేదట.

ఏమైనా, నామకరణసందర్భంలో వీలైనంతవరకు అది సార్థకనామధేయం కావడానికి ప్రయత్నించాలి. అనాకారికి సుందరరావు అని పేరుపెట్టినా, స్థూలశరీరునికి లలితకుమార్ అని పేరుపెట్టినా, జాలిగుండె వంశంలోనే లేనప్పుడు కరుణాకరమూర్తి అని పేరుపెట్టినా, అది ఇట్టే పట్టిచ్చివేస్తుంది. కుటుంబంలో చదువుసంధ్యలు శూన్యమైనప్పుడు కమలం, సుబ్రహ్మణ్యం—ఇట్టి పేర్లుపెడితే, అవి "కవళం"గా, "చుబ్రమణ్యం"గా అపభ్రంశం కావడం తప్పదు. పేరుకు, ప్రవృత్తికిమధ్య, లేదా పేరుకు, రూపానికిమధ్య, లేదా పేరుకు పరిస్థితులకుమధ్య కానవచ్చే వైరుధ్యం వింతగానో, వినోదంగానో, విడ్డూరంగానో తోస్తుంది. "పేరు గొప్ప, ఊరు దిబ్బ", "పేరు గంగానమ్మ. తాగబోతే నీళ్ళు లేవు", "పేరు పల్లకీమీద, కాలు నేలమీద", "ఇంటిపేరు కస్తూరివారు, ఇంటిలో గబ్బిలాలవాసన"—ఇత్యాది సామెతలు

పుట్టడానికి కారణమిదే. ఈ బాపతు ఒక సామెత హిందీ వారికీ వున్నది. "అమర్‌నాథ్ మర్‌గయా, లక్ష్మి గోబర్ బేచ్‌తీ, ధన్‌పాల్ భీఖ్ మాంగ్‌తా హై." దీని అర్థ మిది: అమరనాథుడు మరణించాడు, లక్ష్మి పేడ అమ్ముకొంటున్నది, ధనపాలుడు తిరిపమెత్తుకుంటున్నాడు. అయితే, ఇంతవర కిది పూర్వార్థంమాత్రమే. ఉత్తరార్థం "మేరానామ్ తంతన్‌పాల్" అని. అంటే "నాపేరు తంతన్‌పాల్." ఇంత చెప్పిన తర్వాత చివరికి ముక్తాయింపు "బేచారా!" ("పాపం!") అని. పాప మనడం ఎందుకంటే, కనీసం పేరులోనైనా తంతన్‌పాల్‌కు ఘనత లేదని. కాని, నిజానికి జాలిపడవలసింది తంతన్‌పాల్‌ను చూచి కాదు, తొలి ముగ్గురుని గురించే. తమ పేరు విన్న ప్రతిసారి—మాటలకు అర్థం తెలిసినవారైతే, సునిమెత్తని మనస్సుగలవారైతే — అది కేవల మొక వెక్కిరింతగానో, వెటకారంగానో వారిని బాధపెట్టి తీరుతుంది.





# దాహం

"ఏనుగు దాహానికి చూరునీళ్లా?". కాని, కీన్యా ఏనుగులకు ఈమధ్య చూరునీళ్లుకూడా కరవైపోయినట్టు పత్రికల ద్వారా వింటున్నాను. ఆ తూర్పు ఆఫ్రికా రాజ్యంలో ఈ యేడు వానలు బహు తక్కువట. అక్కడి అడవులపై మరీ చినుకైనా రాలలేదట. మనకు తెలిసిన సంగతే కదండీ! — వానదేవుడు చెడ్డ తిక్కమనిషి. రమ్మన్న చోటుకు రమ్మన్నప్పుడు రాడు; పొమ్మన్నచోటునుంచి పొమ్మన్నప్పుడు పోడు. "వద్దు మొర్రో!" అనే వారి వెంట విడవకుండా పడతాడు. "కాస్త తొంగైనా చూడరాదటయ్యా, స్వామీ! — నీకు పప్పుబెల్లం పెడతాము" అని మొత్తుకునేవారిపై తెంపులేని కక్ష కడతాడు. పల్లెటూళ్ళను, పంటచేలను విడదొక్కుకు వెళ్ళి కొండలు,

మిట్టలు యెక్కి కూర్చుంటాడు. చెరువులు, దొరువులు నించ డానికి మారుగా అడవులపైనో, సముద్రాలపైనో దయ చూపుతాడు. ఒక్కొక్కనాడు "నా ప్రతాపం చూపబో తున్నాను—కాచుకోండి" అంటూ తన మబ్బుల సైన్యాలను సమీకరిస్తాడు. చిన్న మబ్బులు, పెద్ద మబ్బులు, లేత మబ్బులు, కారుమబ్బులు, మిసమిసలాడే మబ్బులు, బుసబుస పొంగే మబ్బులు, తుళ్ళింతలాడే మబ్బులు, తళతళమెరిసే మబ్బులు— లెక్కలేనన్ని అక్షోహిణుల సైన్యాన్ని నిలువు తాడు. ఒక్కొక్క మెరపుతో ఒక్కొక్క "అంత్య సందేశ" మిస్తాడు. "ఉత్తుత్తి బెదరింపులు కావు సుమీ!" అని హడలగొట్టడానికి గాలిలోకి పిడుగు ఫిరంగులు వదలు తాడు. ఇంత ఆర్భాటం చేసినవెనక చల్లగా డేరా పీక్కుని కాలికొద్దీ పారిపోతాడు. మరొక్కొక్కనాడు చడీచప్పుడు కాకుండా దొంగపోటుగా వచ్చి దబాటుదెబ్బ తీసిపోతాడు. మరీ తిక్కతిరిగితే కుండపోతపోసి, ఊరూ నాడూ ఏకంచేసి పోతాడు. అదీ, ఇదీ కాకపోతే, వడగళ్ళతో తల బొప్పి కట్టిస్తాడు. వానదేవుడు ఇంత చపలచిత్తుడు కాబట్టే "వాన రాకడ, ప్రాణం పోకడ తెలియ"దన్నారు. చపలచిత్తునికి నీతీ నియమం ఏమి వుంటాయి? కనుక, మామూలుగా తాను తరచు మకాంపెట్టే కీన్యా అడవులపై ఈ సంవత్సరం బొత్తిగా శీతకన్ను వేసినట్టున్నాడు. దానితో అక్కడి ఏనుగులకు గొంతు తడుపుకోడానికైనా గుక్కెడునీళ్లు పుట్ట కుండా పోయాయట. దాహానికి తాళలేక తమ నెలవులను

వదలి అవి మందలు మందలుగా నదీనదాల వైపు, జనపదాల వైపు మొగబడుతున్నాయట.

అసలే అడవి ఏనుగులు. పైగా దప్పిగొని వెర్రి గంగిర్లెత్తివున్నట్టివి. అవి ఊళ్ళపైకి వచ్చిపడితే ఇల్లూ వాకిల్లూ విడిచిపెట్టి "బ్రతుకు జీవుడా!" అంటూ ఆబాలగోపాలం పిక్కబలం చూపవలసిందే. ఈ ప్రమాదాన్ని పాటించే జనవాటికల దిశగా మరలుతున్న హస్తితండా లన్నింటిని కాల్చివెయ్యవలసిందిగా కీన్యా ప్రభుత్వం ఉత్తరువు జారీ చేసిందట. అప్పుడే ఒకచోట పదకొండింటిని కాల్చివేశారట కూడా. ఇట్టి ముప్పే చంద్రగుప్తమౌర్య సామ్రాజ్యాన్ని ఎదుర్కొంటే ఇట్టి చర్యనే గైకొనివుండేవారా? ఏమో, నాకు సందేహమే. "ఏనుగును చంపినవానికి మరణదండన విధించాలి" అని కౌటిల్యుని అర్థశాస్త్రం శాసిస్తున్నది. ఏనుగు ప్రాణానికి ఆ కాలంలో ఇంత విలువ నివ్వడానికి కారణ మేమని మనం వెతుక్కోనక్కరలేదు; అర్థశాస్త్రంలో ఏనుగులను గురించి ఒక పూర్తి ప్రకరణానికి ప్రకరణమే కాక, కనీసం మరి మూడు-చోట్ల వాటి ప్రసక్తి విస్తృతంగా వున్నది. శత్రువ్యూహాలను చిందరవందర చేయడానికేమి, అరిదుర్గాలను, ఇతర రక్షణ శ్రేణులను నుగ్గునుగ్గు చేయడానికేమి ఏనుగులకు చాలినవి లేవని కౌటిల్యుడు వ్రాశాడు. చతురంగ బలాలలో ఒక భాగమైనప్పటికీ రణరంగంలో రాజుల జయాపజయాలను ముఖ్యంగా నిర్ణయించేది గజబలమేనని చెప్పాడు.

ఇందువల్లనే ఏనుగును పొట్టబెట్టుకున్నవాడిని ప్రాణాలతో విడవరా దన్నాడు. నాటి యుద్ధతంత్రందృష్ట్యా దీన్ని తీవ్ర శిక్ష అనలేము. టాంకును ధ్వంసంచేసినవాడికి ఈనాడు సామాన్యపు శిక్ష వేస్తారా? ఈ కాలానికి టాంకు లెంతో, గడచిన కాలానికి ఏనుగు లంతే. కాబట్టే వాటిని ఎలా పట్టుకోవాలి, ఎలా మచ్చికచేసుకోవాలి, ఎలా మేపాలి, వాటి జాతు లేవి, ఏ జాతి ఏ పనికి ఉపయోగం—ఒక్క టేమిటి?—వాటిని గురించిన సమస్తం అర్థశాస్త్రాన్ని పోలిన రాజనీతి గ్రంథంలోకి ఎక్కిపోయింది. ఆఖరికి వాటి లద్దెల మాటకూడా దానిలో వున్నది. అడవిలో ఏనుగుల జాడ కనిపెట్టాలంటే, వాటి లద్దెలకోసం చూడాలట. రాజ్యాలు నిలవడం, చితికిపోవడం కుంజరయూథాలపై ఇంతగా ఆధార పడిందని నమ్మినవాడు కావడంచేత, దప్పిగొన్న ఏనుగులు ఊళ్లపై పడితే కౌటిల్యుడు బహుశా ఊళ్లను ఖాళీచేయించే వాడు; కొంతమంది చచ్చినా సరే, నూతులనుంచి నీళ్లు తోడించి, తొట్లను నింపించి, వాటివద్ద మూగినవాటిలో వీలైనన్ని వేదండాలను పట్టించి కోటలోని చతురానికి (గజశాలకు) తోలించేవాడు.

క్రీస్తుశకానికిపూర్వం మౌర్యసామ్రాజ్య మహామంత్రి కౌటిల్యుడే కాదు, క్రీస్తుశకం పదహారవ శతాబ్దంలో విజయనగరసామ్రాజ్యం మహామాత్యుడు తిమ్మరుసుకూడా బహుశా ఇంతే చేసేవాడు. చంద్రగుప్తమౌర్యుడు రాజ్యా నికి రావడానికి ముందే గజబలం కారణంగా అలెగ్జాండర్‌పై

యుద్ధంలో పోరస్ (పురుషోత్తమ్) దెబ్బతిన్నా—అశ్వారూఢులైన గ్రీక్ ధనుర్ధారుల ధాటికు తాళలేక, పోరస్ సేనల మొగదలవున్న ఏనుగులు చెల్లాచెదరై తమ వారినే నుగ్గునుగ్గుగా తొక్కివేశాయి—మనరాజులు ఇటీవలివరకు పోరులో గెలుపుకు ఏనుగుపై ఏనుగంత ఆశపెట్టుకునేవారు. హంపి, విజయనగరం శిథిలాలలో ఇప్పటికీ చెక్కుచెదరకుండా కొట్టవచ్చినట్టు మిగిలివున్నట్టిది ఏనుగులశాలే.

యుద్ధతంత్రందృష్ట్యా పూర్వపు ప్రాధాన్యాన్ని పూర్తిగా కోల్పోయినందునే కీన్యా ఏనుగులకు ఈనాడు దప్పితో కాకపోతే తుపాకిగుండుతో చావవలసిన దుర్గతి పట్టింది. అసలు ఏనుగును చూస్తేనే నాకు జాలి. ఇంత శరీరాన్ని—పాపం!—వీరు ఎలా మోస్తారని స్థూలకాయులందరిపై వుండే జాలే నాకు మత్తేభంపట్లకూడా వున్నది. అది పెంపుడు ఏనుగైతే, "కొండంత ఈ ప్రాణి వేలెడు మావటీడుకు ఎంత లోకువైపోయింది" అని మరింత జాలి కలుగుతుంది. ఇక అంత ప్రాణి గుక్కెడు నీళ్ళులేక గిజగిజలాడిపోతున్నదంటే, "అయ్యో" అనిపిస్తున్నది. "కాలుట" వ్యుత్పత్తిగాగల "దాహము" "దప్పిక"కు పర్యాయపదం కావడం నిర్నిమిత్తంగా జరగలేదు. కీలుకీలును, నరనరాన్ని, అణువణువును దహించి నెయ్యగలిగిందే దప్పికబాధ. అనుభవించినవారికే తప్ప దాని తీవ్రత తెలియదు. అది నాకు ఒకసారి అనుభవమైంది నా చిన్నతనంలో. జతపిల్లలు అయిదారుగురితో చేరి ఒక వేసవిలో మా ఊరు పంట

కాల్వగట్టుకు—ఆ కాల్వపేరు కొత్తకోడు—సీమ చింత కాయలకోసం బయల్దేరాను. ఊరు దరిదాపులలో సీమ చింతలు లేవు. ఒకటి, రెండు వున్నప్పటికీ వాటికి కాయలు లేవు. అందువల్ల కాల్వగట్టు పుచ్చుకుని చాలాదూరం నడిచి వెళ్ళాము. హీనపక్షం రెండు పొలిమేరలను దాటినట్టే గుర్తు. కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళగా వెళ్ళగా విరగకాసివున్న చెట్లు కొన్ని కనిపించాయి. వాటిని చూడగానే మా లేతకాళ్ళ నొప్పులన్నీ యెగిరిపోయాయి; మా ముఖాలు చేటంత అయ్యాయి. సంబరంకొద్దీ మాలో కొందరు చప్పట్లు చరుస్తూ గెంతారు. బాగా ముగ్గి, పొట్టఅరవిచ్చిన సీమ చింతకాయలు కొమ్మకొమ్మకు, రెమ్మరెమ్మకు గుత్తులు గుత్తులుగా వ్రేలాడుతున్నాయి. కొన్ని నెలవంకలవంటి కాయలు కాగా, మరికొన్ని చక్రాలాలవలె మెలికలు తిరిగినవి. తెల్లతెల్లని, యెర్రయెర్రని పప్పులనుంచి, కనబడీ కనబడకుండా నల్లని గింజలు తొంగిచూస్తూ మాకు గిలిగింతలు పెట్టాయి. అయితే, పంటకాల్వగట్టుపై యేపుగా పెరిగివున్న చెట్లేమో వాటినెక్కడం మా పసిప్రాణాలకు కష్టమైంది. అయినా, మేము పట్టు విడవలేదు. ఇద్దరిని దిగవిడిచి, తక్కినవాళ్ళం వాళ్ళచే కాళ్ళకు మెట్లు పెట్టించుకుని ఎలాగో పైకెగబాకిపోయాము. ముళ్ళమేళ్ళైనా సరకుచెయ్యక, చిటారుకొమ్మలవరకు పాకి, కంటికి నదరుగా కనబడిన కాయలన్నీ కోసి కడుపునిండుగా తింటూ, కిందివారిద్దరినీ ఊరిస్తూ, ఉడికిలిస్తూ, బతిమాలించుకుని

వాళ్ళకూ మంచిమంచివాటిని జారవిడుస్తూపోయాము. ఎక్కా తక్కీగా తిన్నా ఇంకా ఆశతీరక చొక్కా జేబులను, పంట్లాం జేబులను కాయలతో బిర్రుగా నించుకుని మేము యింటి ముఖం పట్టేసరికి మిడసరి లగ్న మైంది. ఎర్రనియెండ కాస్తున్నది. పడమటిగాలి నిప్పులు చెరుగుతున్నది. సీమచింతకాయలు వగరుగా వుంటాయేమో, వాటిని మితిలేకుండా తిన్న మా గొంతులు పొడి ఆరినవి. మే మున్నది కాల్వగట్టుపై నే కాని, కాల్వలో నీళ్ళచుక్క లేదు. వెళ్ళినదారినే తిరిగివస్తే, దారిలో నైనా కాసిని నీళ్ళు దొరికేవి. పైగా, నీడపట్టున నడిచేవాళ్ళం. కాని, డొంకనుపడితే సగందూరమేనని దానివెంట బయల్దేరాము. సగందూరం వచ్చేసరికి నా నాలుక పిడచకట్టుకుపోయింది. ముక్కూముఖం వెంట వేడి పొగలు వెడుతున్నట్టు అనిపించింది. దూరాన కానవస్తున్న ఎండమావులు తప్పతాగి, వొళ్ళు తప్పి, మరీ విపరీతంగా గంతులు, చిందులు వేస్తున్నట్టు అనిపించింది. నే నెలా నడుస్తున్నానో నాకే తెలియలేదు. మరి కాస్తదూరం సాగారేసరికి నాలుక పీక్కుపోతున్నట్టు అనిపించింది, శరీరమే తడి ఆరిపోతున్నట్టు తోచింది, నరనరం పీకివెయ్య సాగింది, కళ్ళు బైర్లు కమ్ముకుపోయాయి, కాళ్ళుతడబడి తూలిపడబోయాను. నేను జావకారడం, గుడ్లుతేలవెయ్యడం చూచి నా జతవాళ్ళు నా రెక్కలు తమ భుజాలపై వేసుకుని సగం మోస్తూ, సగం ఈడుస్తూ గబగబ ఊరు దరిదాపులకు చేర్చారు. అక్క డొక ఆసామి తాం బేటిబుర్రలోనుంచి

ఇన్ని చల్లని నీళ్ళు నా గొంతులో పోయించారు. అప్పుడు ఆ పుణ్యాత్ముడు యెదురై వుండకపోతే, ఇప్పుడు నేను ఈ వ్యాసాన్ని వ్రాస్తుండేవాణ్ణికానేమో!

ముప్ఫైయేళ్ళపైమాట కాబట్టి దప్పిక బాధను నేను సరిగా వర్ణించి వుండకపోవచ్చు. కాని, అది పగవాడికైనా కూడనిదని మాత్రం నిస్సంకోచంగా చెప్పగలను. క్షుత్తునైనా సహించవచ్చుగాని తృష్ణను కాదు. వరసగా మూడు రోజులు ఉపవసించిన నా అనుభవంలో మొకటి ఇరవైనాలుగు గంటల తర్వాతే మరీ బాధగా వుంటుంది. దాన్ని తట్టుకుంటే మూడవనాటికి చెడ్డ నీరసంతప్ప వేరే పెద్దబాధ ఏదీ వుండదు. జెయిల్‌లో దాదాపు రెండునెలలు నిరాహారదీక్షసాగించిన నా మిత్రులొకరు అయిదవ రోజునో, ఆరవ రోజునో తిరిగి ప్రాణాలు తోడివేస్తున్నట్టుగా వుంటుందని, ఆపిదప బలవంతంగా ఆహారాన్ని యెక్కించడానికి జెయిల్ అధికారులు పెట్టేవే ఎక్కువ బాధలని చెప్పినట్టు జ్ఞాపకం. ఏమైనా, దప్పికబాధకు ఇట్టి ఆటుపోటులు లేవు. ఒకసారి ప్రారంభించిన తర్వాత క్షణక్షణం అది తీవ్రతరమైపోతుంది. ఏపాటి తీవ్రతతోనో తెలియదుకాని శ్రీనాథుడు దప్పిక బాధను చవిచూచినవాడే. ఇందుకు తార్కాణం—

సిరిగలవానికిఁ జెల్లును
తరుణుల బదియారువేలఁ దగఁ బెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా?
పరమేశా! గంగవిడుము, పార్వతి చాలున్

అని ఆయనచెప్పిన చాటువే.

దాహం ఎంత దుస్సహమైనదైనా, అంతకంటెకూడా బాధాకరమైనవి ధన, కీర్తి, అధికారాది దాహాలు. మొదటిది శరీరానికే చిచ్చుపెట్టగా, తక్కిన ఈ దాహాలు అంగాంగంతోపాటు మనస్సుకు, ఆత్మకుకూడా అగ్గిపెట్టి వేస్తాయి. ఈ దాహపీడితులైనవారు ఆడని అబద్ధం, వేయని నింద, చెయ్యని దుష్కృత్యం, పాల్పడని నైచ్యం, వొడిగట్టని పాపం, ఆర్పని కొంప వుండవనే చెప్పవచ్చు. డబ్బు దప్పిక పుట్టినవాడికి ఇతరుల ప్రాణాలు డుబ్బు చెయ్యవు. "ఆకలికి చస్తున్నాము, బాబయ్యా!" అని సాగిలబడినా, "నా వద్ద బస్తాపై నేనడిగిన ధర పెడితేనే దాన్ని కదల నియ్యడం" అని అతడు మొండికెత్తుతాడు. ఇవ్వాళ నలుగురైదుగురు చస్తే, రేపటికి మరింత ధర పలకవచ్చునని ఆగినా ఆగుతాడు. "నా బిడ్డప్రాణం పోతున్నది—మందు కావాలి, బాబూ!"అని కాళ్ళావేళ్ళా పడినా, తాను కోరిన పెచ్చుధర చెల్లించి తీరాలంటాడు. "నీ కడుపున పుడతాను—నా కొంపలో దీపం నిలుపు" అని వేడుకుంటే "పుట్టక పుట్టక నువ్వే పుట్టాలా! పోపో!!" అని విదిలించి వేస్తాడు. "శవంమీద కప్పే గుడ్డపైనా లాభాలు తీస్తావటయ్యా!" అని దుఃఖంలోనున్నవా డెవడైనా ముఖాన అనివేస్తే "వెళ్లే పీనుగులు తక్కువా? —నువ్వు కాకపోతే నీ అబ్బగాడు వచ్చి కొంటాడు" అని దయమాలి అంటాడు. ధనదాహపీడితునికి సిగ్గుయెగ్గులుకూడా వుండవు. ఒక కాసు కలిసివచ్చేచోట ముఖాన ఉమ్మివేసినా తుడుచుకుంటాడు

సరిగదా, "హీహీ" అంటూ పళ్ళు యికిలిస్తాడు. "నా గడప తొక్కవద్దు" అని గెంటివేస్తే మర్నాటికే మళ్ళీ తోకాడించుకుంటూ వస్తాడు. లోకులమాట అటుంచి, ఆలుబిడ్డలనుసయితం అన్యాయం చేయడానికి సంకోచించడు. నక్క, తోడేలు, గాడిద, రాబందు — ఈ నాల్గింటి సాంకర్యాన్ని ధనతృష్ణాపీడితునిలో చూడవచ్చు.

ఇంతకంటెకూడా చెడ్డవి కీర్తి, అధికారదాహాలు. మానవ చరిత్ర పుటలను మలినంచేస్తున్న నెత్తురు మాసికలలో ముప్పాతికకు ఇవే మూలం. హిరణ్యాక్షుని మొదలు హిట్లర్ వరకు ప్రతి లోకకంటకుని విజృంభణ, వినాశాలకు ప్రేరేపించినవి కీర్తి, అధికారదాహాలే. శమింపజేసినకొద్దీ ఈ తృష్ణలు మరింతగా ప్రజ్వలిస్తాయి. నాటికి తెలిసిన ప్రపంచంలో సగాన్ని పదమూడేళ్ళలో—తనకు ముప్పైసంవత్సరాలు నిండీ నిండకముందే—జయించగలిగినా అలెగ్జాండర్‌కు తృప్తిలేకపోయింది. జైత్రయాత్రను విరమించి సట్లెజ్ నదీతీరంనుంచి అతడు వెనక్కు తిరిగింది స్వచ్ఛందంగా కాదు; మరి ఒక్క అడుగైనా ముందుకు పెట్టడానికి తన సైనికులు నిరాకరించినందునే. తీరని తమ తృష్ణకోసం కీర్తి, అధికారకాముకులు నిత్యకల్యాణం, పచ్చతోరణంగా వుండే ప్రాంతాలను ఊసరవెల్లి క్షేత్రాలుగా చెయ్యడానికేమి, ఎన్ని నిండుప్రాణాలనైనా నిలువునా తియ్యడానికేమి అణుమాత్రమైనా సంకోచించరు. "నేను అడుగుపెట్టినచోట మరి గడ్డిపరకైనా మొలవదు" అని అట్టిలా చెప్పినమాట

తననుగురించే కాదు, తన పలుకు శాసనమై చెల్లాలని కోరుకునే ప్రతివాడినిగురించీ. ప్రపంచ విజేతలవరకు పోనక్కరలేదు; పల్లెటూరుపై పెత్తనాన్ని చెలాయించే వానినే చూడండి: "నాపేరు చెబితే కాకులు నీళ్ళు తాగవు" అని ఎంత విర్రవీగుతూ మీసం మెలివేస్తాడో! "లోకానికి నీపట్ల భయంతోపాటు భక్తివుంటే సంతోషమే. కాని భక్తి ఇతరులు చూపవలసింది; భయం నీవు పెట్టగలిగింది. అందువల్ల భక్తిని పొందగలిగినా, లేకపోయినా, భయపెట్టి బ్రతుకు" అని మాకియవిల్లీ చెప్పిన సూత్రాన్ని ఆ రాజనీతితంత్రజ్ఞుడు జన్మించకపూర్వంనుంచీ ప్రతి అధికారవ్యామోహితుడు పరిపాలిస్తున్నాడు.

తృష్ణలలో నింద్యం కానిది ఏదంటే, నాకు చప్పున తోస్తున్న దొక్కటే. అది—జ్ఞానతృష్ణ.

